ఆంధ్రవిజ్ఞానసమితి. నె 3 రు.

# వాల్మీకిచరిత్రము

రఘునాథభూపాల
ప్రణీతము.

ప్రకాశకులు:
ఆంధ్రవిజ్ఞానసమితి,
విజయనగరము.

వెల రు. ౧-౦-౦

రావుసాహేబు, వేపకొమ్మ గురువేంకటసుబ్బయ్యగారు,
బి. ఇ. యం. ఐ. ఇ.

అధ్యక్షులు:-ఆంధ్రవిజ్ఞానసమితి,

విజయనగరము.

కాకినాడముద్రాక్షరశాల,

కాకినాడ.

# నివేదన.

కం. చెప్పవలెఁ గప్పురంబులు
కుప్పలుగాఁ బోసినట్లు కుంకుమపై పై
గుప్పినక్రియ విరిపొట్లము
విప్పినగతి ఘుమ్మనం గవిత్వము సభలన్.

కం. చెవులకుఁ జవులై చల్లఁగ
గవులకుఁ దవులై సమస్తకావ్యకళా బం
ధువులై రస సింధువులై
యవురాయని కవితలవని నలరఁగవలదా !

రఘునాథ భూపాలప్రణీతమగు శ్రీవాల్మీకి చరిత్రమును మా "ఆంధ్రవిజ్ఞానసమితి" తృతీయగ్రంథముగ నాంధ్రలోకమునకు సమర్పించుచున్నారము.

భారతభూభాగమున శ్రీమద్రామాయణమును, తత్కథానాయకుఁడగు శ్రీరామచంద్రమూర్తిని, తన్మహాకావ్యకృతికర్తయగు నాదికవివాల్మీకిమహామునిని యెఱుంగని వారుండరనియే చెప్పవచ్చును. శ్రీరఘునాథుని పావనచరిత్రము సమరభాషయందు రచింపఁబడి, తానుతరించి, భారతీయులను తరింపజేయుచున్న యాదికవి వాల్మీకిమహామునిదివ్యచారిత్రము నాంధ్రభాషయందు హృద్యపద్యప్రబంధముగ రచియించిన తంజాపూరి రఘునాథ

భూపాలు డాంధ్రకవితాప్రపంచమున తరించి, మించుటయేగాక, దక్షిణాంధ్రవాఙ్మయము నుజ్జీవింపజేసి, రాజకవియై, కవిరాజై చెన్నొందెను.

ఈ రఘునాథభూపాలునిగూర్చియు, యీతని కవితా వైదుష్యమునుగూర్చియు పీఠికయందు విపులముగ వివరింపఁ బడుటచే, నిచ్చట నుదృటించుట పునరుక్తియగును.

ఈగ్రంథరాజమునకు, అశ్రుతపూర్వములును అభినవక ల్పనార్హప్రదములును నగు విషయముల నేర్చికూర్చి పీఠికనువ్రాసి యిచ్చిన నిడుదవోలు వేంకటరావు బి. ఏ గారికి మాకృతజ్ఞతా వందనకుసుమసముచ్చయము సర్పించుచున్నారము.

ఆంధ్రవిజ్ఞానసమితి,
విజయనగరం
28-6-40

ఇట్లు,
వేపకొమ్మ గురువేంకటసుబ్బయ్య
అధ్యక్షులు.

# ఉపోద్ఘాతము.

ఘ



ఈవాల్మీకిచరిత్రమను రసవత్ప్రబంధము తంజాపురాంధ్రవాఙ్మయమునకుఁ జెందినది. తంజాపురాంధ్రవాఙ్మయ మనఁగనే తెలుఁగువారికి విజయవిలాసకృతి, కృతికర్త చేమకూర వేంకటకవి, కృతిభర్త రఘునాథనాయకుఁడు దలఁపునకు వత్తురు. మేలిమి తెలుఁగుపలుకుబడిని వన్నెమీఱు విజయవిలాసమునుం బోని రసవత్ప్రబంధములే గాక, యాంధ్రవాఙ్మయమునకుఁ బ్రత్యేకవ్యక్తిత్వము నొడఁగూర్చిన ద్విపదలు- యక్షగాననాటకములు- గేయరచనములు- పదకవితలు- మున్నగు జాతీయవాఙ్మయశాఖ లపారముగ విలసిల్లిన తంజాపురాంధ్రవాఙ్మయ ముపలబ్ధమగునంతదనుక నాంధ్రు లెఱింగినచోఁ బ్రమోదాశ్చర్యమనస్కులు గాకమానరు. సాహిత్యవిషయమునసే గాక చారిత్రకముగ, తంజపురాంధ్రవాఙ్మయ మఘునాతనాంధ్రవాఙ్మయమున ముఖ్యఘట్టము- దక్షిణాంధ్రసారస్వతచరిత్రమునఁ దొలియధ్యాయము.

పదునాఱవశతాబ్దమధ్యమున విజయనగరసామ్రాజ్యవిచ్ఛిత్త్యనంతరమునఁజిరకాలమునుండి దాక్షిణాత్యరాజ్యములని పేరెన్నికఁగన్న పాండ్య చోళరాజ్యము లాంధ్రవాఙ్మయమునకుఁ బట్టుఁగొమ్మ లయినవి. ఆంధ్రసాహిత్యాభివృద్ధి కనుకూలము

లగుపరిస్థితు లేర్పడినకతన- తంజావూరు- మధుర- పుదుక్కోట- సేలము- కార్వేటినగరము- మైసూరు మున్నగురాజాస్థానము లాంధ్రవాఙ్మయరంగము లైనవి. అందు తొలిరంగ మగుతంజావూరిను క్రీ. శ. 1535 మొదలు క్రీ. శ. 1673 వఱకుఁ బరిపాలించిన నాయకరాజులకాలమున నాంధ్రవాఙ్మయ మెంతయో యభివృద్ధినందినది.

తంజావూరిను నాయకరాజ్యసంస్థాపకుఁడగు చినచెవ్వప్ప నాయకుఁడును, ఆవెనుక నాతని కొమరుఁడు, అచ్యుతప్ప నాయకుఁడును క్రీ. శ. 1614 వఱకుఁ బరిపాలించిరి. అచ్యుతప్ప నాయకునివెనుక రాజ్యమునకు వచ్చినవాఁడు తంజాపురాంధ్రనాయకరాజశిరోమణి రఘునాథుఁడు.

### రఘునాథనాయకుఁడు (1614-1633)

దక్షిణహిందూదేశసారస్వతచరిత్రమున కృష్ణదేవరాయలవెనుక రఘునాథుఁడు మిక్కిలి ప్రసిద్ధుఁడు. కృష్ణదేవరాయలవలెఁ బరాక్రమశాలియై సంగీతసాహిత్యవిద్యావిశారదుఁడై కవిపండితపోషకుఁడై, కృతికర్తయై యాంధ్రులకుఁ జిరస్మరణీయుఁడైన నాయకరాజు- రాయలకు నల్లసాని పెద్దన మనుచరిత్రను- రఘునాథనాయకునికి వేంకటకవి విజయవిలాసము[1]- రాయలకు

---

1. విజయవిలాసమను నీసభాభవనము పేరును బట్టియు, రఘునాథరాయలు నేపాళచోళగులయుద్ధమున విజయముఁ గాంచుటచేతను 'చేమకూర వేంకటకవి భావస్ఫోరకముగఁ దనకావ్యమునకు విజయవిలాసమని పేరును బెట్టి యుండును. ఈభవనము రఘునాథనాయకునిచే విజయచిహ్నముగఁ గట్టింపఁబడినది.

భువనవిజయసభారంగము- రఘునాథనాయకునికి విజయభవనసభారంగము- రాయలకు తిమ్మరసుమంత్రి, రఘునాథనాయకునికి గోవిందదీక్షితుఁడు. ఇరువురు వైష్ణవమతప్రవిష్టులు- ఇరువురు నశ్వకళాశేవంతులు ఇరువురు సంగీతవిద్యారసికులు[2] చూపినకొలఁది నిట్లెన్నియేని పోలికలు గలవు- ఒక్కొక్కపుడు కృష్ణదేవరాయలే రఘునాథనాయకుఁడై జన్మించెనా యనుసందియము పొడముచుండును. విజయనగరమున కృష్ణరాయలనాఁటి వైభవము తంజాపురమున రఘునాథనాయకుని కాలమునఁ గొంత పునరుద్ధరణముఁ జెందినది.

కృష్ణదేవరాయలకాలముకన్న రఘునాథనాయకునికాలమునఁ గవయిత్రులు పెంపుఁ జెందుట విశేషము- తంజాపురాంధ్రనాయకచరిత్రమునఁ గవయిత్రులకు నున్నతస్థానము గలదు. రఘునాథరాయని కాలమున రామభద్రాంబయు, మధురవాణియు నను నిరువురు కవయిత్రులే గాక సాహిత్యవిద్యావిశారదలు పెక్కురాస్థానమున నున్నట్లు తెలియుచున్నది. రఘునాథనాయకుఁడు సంస్కృతమునఁ గేవలకవియే గాక శాస్త్రజ్ఞుఁ

2. కృష్ణదేవరాయలు సాహిత్యవిద్యావిశారదుఁ డగుటయే గాక సంగీతవిద్యాప్రియుఁడు. అభినవభరతాచార్యుఁడు; బండారులక్ష్మీనారాయణ రాయలకుఁ గృతిగా "సంగీతసూర్యోదయము" అనునైదధ్యాయముల సంగీతశాస్త్రగ్రంథము రచియించినాఁడు- అందు రాయలకాలమున సంగీతశాస్త్రజ్ఞులు పెక్కురు పేర్కొనఁబడిరి. మధ్వయతి శ్రీకృష్ణాచార్యునియొద్ద రాయలు వీణావాదనము నేర్చెను. రఘునాథనాయకుఁడు ప్రవీణుఁడగుట సార్థకమే!

డగు పండితుఁడు. రామభద్రాంబ సంస్కృతమున "రఘునాథాభ్యుదయమును పండ్రెండుసర్గల మహాకావ్యమును రచియించెను. మధురవాణి యను కవయిత్రి రఘునాథనాయకుఁడు తెలుఁగున రచియించిన రామాయణమును సంస్కృతీకరించెను.[8] ఈమె తొలిపేరు శుకవాణి యనియు, నీమెకు మధురకవిత్వము వలన మధురవాణి యనుపేరు వచ్చెననియు నామె రామాయణమునఁ జెప్పుకొన్నది.

సంస్కృతమందు రఘునాథనాయకుఁ డపారపాండితీప్రకర్ష గలిగినవాఁడనుటకు, సాహిత్యరత్నాకరకృతికర్తయగు యజ్ఞనారాయణదీక్షితుఁ డితనిశిష్యుఁ డగుటయే చాలును. సంగీతశాస్త్రమున నూతనదృక్పథమును గల్పించి రఘునాథనాయకుఁడు సంగీతసుధ యనియు భరతసుధ యనియు రెండు గ్రంథములు వ్రాసెను. ఇందు, తొలిదానియం దపూర్వగ్రంథము లుద్ధరింపఁబడినవి. రెండవది కానవచ్చుటలేదు. మహాభారతతాత్పర్యసంగ్రహ మను నింకొక సంస్కృతగ్రంథము నీతని రచనమే. పదవాక్యప్రమాణజ్ఞుఁడై, సర్వతోముఖయాజియైన గోవిందదీక్షితుఁడును నలంకారరత్నాకరము- సాహిత్యరత్నాక

---

8. తంజాపురాంధ్రనాయక రాజచరిత్రమున నిందులకు వ్యత్యస్తముగా "రఘునాథరాయలు సంస్కృతమున రామాయణము రచింప మధురవాణి దానిని తెలుఁగునకుఁ బరివర్తన మొనర్చెనని చెప్పుదురు" అని యున్నది. చూ. పుట. 287. ఇది పొరపాటు. రఘునాథనాయకుఁడు తొలి తెలుఁగున రచియింప మధురవాణి యావెనుక దానిని సంస్కృతీకరించెను.

రము, రఘునాథభూపాలీయము మొదలగు గ్రంథములు రచి
యించిన గోవిందదీక్షితుని కొమారుఁడు యజ్ఞనారాయణదీక్షి
తుఁడును, గోవిందదీక్షితుని రెండవకుమారుఁడు వేంకటమఖియు,
కమలినీకలహంసనాటిక' రుక్మిణీపరిణయము, ఆనందరాఘవము,
కావ్యదర్పణము, తంత్రశిఖామణి మున్నగు పదునాఱుగ్రంథ
ములు రచియించిన రాజచూడామణియు, పారిజాతాపహరణ
నాటకకర్త కుమారతాతాచార్యులును నీతని యాస్థానము నలం
కరించిన సంస్కృతకవులు.

రఘునాథనాయకుఁ డాంధ్రమున రచియించిన గ్రంథ
ములలోఁ గొన్ని వినఁబడుచున్నవి. కొన్ని కనఁబడుచున్నవి.

(1) పారిజాతాపహరణము. (2) గజేంద్రమోక్షణము.
(3) రుక్మిణీకృష్ణవివాహయక్షగానము. (4) జానకీపరిణయము.
(5) అచ్యుతాభ్యుదయము. ఇవి వినఁబడుచున్నవి.

(1) వాల్మీకిచరిత్రము. (2) సావిత్రి. (3) నలచరిత్రము.
(4) రఘునాథరామాయణము. ఇవి కనబడుచున్నవి.

పారిజాతాపహరణప్రబంధమును యామద్వయమున
నత్యాశువుగ రచియించినట్లు యజ్ఞనారాయణ రాజచూడామణీ
దీక్షితులు చెప్పుచున్నారు. ఈరచనకు మెచ్చి రఘునాథనాయ
కుని తాతనితండ్రి కనకాభిషేక మొనరించినాఁడు. మనదురదృష్ట
మున నిది యలభ్య మగుచున్నది. అచ్యుతాభ్యుదయమునఁ దన
తండ్రిచరిత్రమును రఘునాథుఁడు తెలిపి యుండవచ్చును. తాని

గ్రంథము రచియించినట్లు రఘునాథనాయకుఁడతని రామాయణమునను, నలచరిత్రమునను గూడఁ జెప్పికొనినాఁడు. ఇదియు నలభ్యమే.

కనఁబడిన గ్రంథము లన్నియు ముద్రణభాగ్యము నందినవి. వాల్మీకిచరిత్రము, తొల్లిసరస్వతీపత్రికయందుఁ జాలభాగమును నావెనుక చిత్రాడ యముద్రితాంధ్రగ్రంథసర్వస్వమున మిగిలినభాగమును ముద్రింపఁబడినది. ఇది మూఁడాశ్వాసముల ప్రబంధము. దీనినే సర్వాంగసుందరముగ నాంధ్రవిజ్ఞానసమితి వారు యిపుడు ముద్రింపించిరి. సావిత్రి, శృంగారసావిత్రి యను పేర శృంగారగ్రంథమాలలో ముద్రింపఁబడినది. ఇదియుఁ బద్యకావ్యమే. నలచరిత్రము- చిత్రాడ శ్రీరామవిలాసగ్రంథమాలలో ముద్రితము. ఇది ద్విపదకావ్యము, ఏడాశ్వాసములు, ఎనిమిదవయాశ్వాసములోఁ గొంతభాగము గలదు. రామాయణమిప్పు డాంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడినది. ఇది పద్యకావ్యము. నాల్గవ యాశ్వాసము కొంతభాగముమాత్రమే గలదు. ఉన్నంతవఱకీ గ్రంథముద్రణమునకుఁ బరిషత్తువారు పూనుకొనుట మిక్కిలి శ్లాఘాపాత్రము. కప్పురములు కుప్పలుగాఁ బోసినట్లు, కుంకుమ పైపైఁజిప్పినగతి విరిపొట్లము విప్పినరీతి కవితఁ జెప్పిన యీకవిరాజు కవితావైశద్యమును వేఱొకచో వివరించినాఁడను. రఘునాథునియాస్థానమున నున్న తెలుఁగుకవులలోఁ దొలివాఁడు.

—: చేమకూర వేంకటరాజకవి :—

వేంకటరాజకవి కృతులు రెండు, విజయవిలాసము-సారంగధరచరిత్రము- తెలుఁగుపలుకుల యొడికమును, ప్రతిపద్యచమత్కృతియుఁదెలుపు విజయవిలాసము నెఱుఁగనివా రుండరు- ఇందలి జాతీయములకు నిప్పటికిఁ బుస్తకసహాయమ్మక్కఱలేకుండ నర్థస్వారస్యమునుఁ దెలుపఁగలవారు పల్లెలలో నచ్చటచ్చటఁ గలరు- దీనికి క్రీ. శ. 1831 వ సంవత్సరమున నాంధ్రభాషోద్ధారకులు బ్రౌనుదొరవారు బ్రహ్మశ్రీ జూలూరు అప్పయపండితులచే టీకవ్రాయించినారు.[4] కృతిరచనాకాలము క్రీ. శ. 1615-1620 ప్రాంతమధ్యము కావచ్చును.

—: కృష్ణాధ్వరి :—

ఈతఁడు నైషధపారిజాతీయమను శ్లేషప్రబంధమును. రచియించి రఘునాథునకుఁ గృతిగా నొసంగినాఁడు. ఇది మైదాశ్వాసములకావ్యము. రఘునాథనాయకుఁ డీకృతికి[5] ముందు, పెక్కుకృతు లందినట్లు కృష్ణాధ్వరి యిట్లు తెలుపుచున్నాఁడు.

---

4. దీనికి తరువాత వేదము వేంకటరాయ శాస్త్రివారును నాంధ్రవిశారద తాపీ ధర్మారావునాయఁడుగారు వ్యాఖ్యలు వ్రాసియాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులైనారు.

5. తంజాపురాంధ్రనాయక రాజచరిత్రమున పుట 237 లో కృష్ణయజ్వకూడా తెనుఁగున శృంగారనైషధపారిజాత మనుద్వ్యర్థికావ్యము రచియించెను. అని వ్రాయబడియున్నది. గ్రంథ నామమునం దెక్కడను ముందు శృంగారపదము గన్పట్టుటలేదు. ఇది శ్లేషకావ్యము, ద్వ్యర్థికావ్యముగాదు-దాని గద్య యిది- "ఇది శ్రీమద్రఘునాథపాలసానుభవనిష్ణాత కృష్ణాధ్వరివిరచితంబైన నైషధపారిజాతీయం బనుపుణ్యశ్లేషప్రబంధమునందు...ఆశ్వాసము"

సీ. నవరస శ్రీరఘునాథభూపాలీయ
నామభామాభీష్ట నాయకుండు
పారిజాతకథావతారికావ్యాహృదయ
కావ్యస్వయంవర వరవల్లభుండు
కల్యాణకౌముదీ కందర్పనాటక
కన్యోద్వహాన బద్ధకంకణుండు
యమరుకాహంకార! హారిభంగిక
శృంగారసంజీవినీ కాముకుండు
తాళచింతామణీ వధూతత్పరుండు
మంచి జామాతరఘునాథ మనుజనేత
తెలియనై షధపారిజాతీయకృతియు
నేవురక్కల చెల్లెలై హెచ్చుననుచు.

—: కవిచౌడప్ప :—

ఆంధ్రవాఙ్మయమున హాస్యరసము వెల్వరించిన కవి చౌడప్ప. రఘునాథనాయకుని యాస్థానమున నున్న ట్లీక్రిందిప ద్యమువలనఁ దెలియుచున్నది.

క. నేరుతునని మాటాడఁగ
వారిజభవునంత వానివశమా! తంజా
వూరిరఘునాథరాయని
గా రెఱుఁగఁగఁ గుందవరపు కవిచౌడప్పా!

ఈతఁడు తెలుఁగుదేశమం దంతట ప్రఖ్యాతిఁ జెందిన చౌడప్ప శతకమే గాక, చౌడప్పసీసములను పేర ముప్పదిసీసములలోఁ జిన్న తెలుఁగు నిఘంటువును రచించినవాఁడు. ఈతఁడు కకుత్‌స్థవిజయమును రచించిన ట్లు అనంతరాజాస్థానమున నున్న వాఁడగుటచేతను, అనంతరాజును, రఘునాథనాయకుఁడును సమకాలికు లగుటచే నీతఁడు రఘునాథరాయని యాస్థానములో నుండుట సమంజసముగనే యున్నది.

ఆంధ్రవాఙ్మయమునఁ గవిరాజశిఖామణి నన్నిచోడదేవుఁడును, సాహితీసమరాంగ సార్వభౌముఁడు శ్రీకృష్ణదేవరాయలును, సంగీతసాహిత్య విద్యారసజ్ఞుఁడు రఘునాథనాయకుఁడును రాజకవిత్రయముగాఁ గీర్తింపదగినవారు. ఆంధ్రవాఙ్మయ చరిత్రమున ప్రత్యేకవిశిష్టత గలిగిన తంజాపురాంధ్రవాఙ్మయమునకు మూలపురుషుఁ డీరఘునాథనాయకుఁడే.

ఈప్రబంధమున కథావస్తువు కవితావతార ప్రథమతీర్థంబగు వాల్మీకి చరిత్రము. పరమపవిత్రమగు నారఘునాథుని చరిత్రము జగదాదిమకావ్యముగ సంస్కృతభారతిని వాల్మీకి రచియించి కవియై కీర్తినందగ, నావాల్మీకిచరిత్రమును నీరఘునాథుఁడు సహజమాధురీధురీణమగు నాంధ్రభాషలో ప్రబంధరూపమున రచియించి, రఘునాథునికే యంకితమొసంగి, కవిరాజై కవితాచరితార్థత గాంచినాఁడు. రఘునాథనాయకుఁ డీ ప్రబంధ

మును రచియించినట్లు గోవిందదీక్షితులవారు "తమసాహిత్యసూధయం దిట్లు చెప్పియున్నారు.

శ్రీపారిజాతాపహరణ ప్రబంధ। చిత్రంచ వాల్మీకి చరిత్రకావ్యం।
తథాచ్యుతేంద్రాభ్యుదయం గజేంద్ర।మోక్షంచరిత్రంచ నలస్య
చిత్రమ్

శ్రీరుక్మిణీ కృష్ణవివాహయక్ష। గానంప్రబంధానటనైకభేదాన్
నిర్మాయవాగ్భిర్నిపుణార్థభాగ్భి। ర్విద్వత్కవీనాంవిదధాసిహర్షమ్.

గ్రంథమున నాశ్వాసాంతగద్యలో రఘునాథునిపేరే యుండుటచేత నిది రఘునాథకృతమనియే నిస్సంశయముగఁ జెప్పనొప్పును.

వాల్మీకిచరిత్రమూలము సంస్కృతమున ధర్మఖండమున నున్నది. మరియు వాసిష్ఠరామాయణము, భక్తవిజయము మొన్నగు గ్రంథములలో నీకథయున్నట్లు తెలియుచున్నది. ఈరెండింటియందును కథలుకొంచెము భిన్నముగ నున్నవి. ధర్మఖండమున వాల్మీకి కిరాతకులుఁడనియు, దోపిడీవృత్తిచే జీవించుచుండెననియు, సప్తర్షి దర్శనముచే రామమంత్రోపదేశమును బొంది మహర్షియై విలసిల్లెననియు కలదు. వాసిష్ఠరామాయణభక్తవిజయములలో నీతఁడు తొలుత నుత్తమబ్రాహ్మణుఁడై, యౌవనమునఁ గిరాతవనితాలోలుఁడై సాధుపురుషసందర్శనసాంగత్యములచే మహాపురుషుఁ డయ్యెననియుఁ జెప్పఁబడియున్నది.

పై రెండింటిలో [6]ధర్మఖండములోనికథనే వాల్మీకి చరిత్రమునఁ ప్రపంచితమై యున్నది. రమారమి మూఁడుపంక్తులలోఁ జెప్పఁ దగిన యీకథను మూఁడాశ్వాసముల మహాప్రబంధముగా రచియించుటయే రఘునాథరాయని కవితాప్రతిభను చాటు చున్నది. వాల్మీకి చరిత్రకథాసూత్రమ్ము గమనించిన నీవిషయము మఱియు స్పష్టమగును.

ముక్తిసుందరీ యౌవనమగు బదరీవనమున శౌనకాదిమహర్షులు హరిస్మరణచిత్తులై యుండ నారదుఁ డచటికి వచ్చెను. మునులు నారదుని విష్ణుకథలనుఁ దెలుపఁగోరిరి. నారదుఁడు వైకుంఠమునకుఁ బోదలంచి తనసఖుఁడగు పర్వతమునిని వారికిఁ జూపి యాతనివలన విష్ణుకథ లెఱుంగుఁడని చెప్పి వెడలిపోయెను. పర్వతుఁడు వారల కిట్లు జెప్పెను.

తెలిదీవియందు శ్రీమహావిష్ణువును సేవించి సప్తర్షులు తిరిగి వచ్చుచు సప్తద్వీపములు సప్తకుల పర్వతములు గడచి తామ్రపర్ణిఁ జేరిరి. ఆతామ్రపర్ణి చెంగటఁగల [7]‘గజతీర్థము నీక్షించి,

---

6. ధర్మఖండము క్రీ.శ. 1700 సంవత్సర ప్రాంతమున గోదావరీమండల ప్రాంతవాస్తవ్యుఁ డీమురుపల్లి భవానీశంకరకవి యాంధ్రమునఁ బదియాశ్వాసముల మహాప్రబంధముగా రచియించి యున్నారు. ఈగ్రంథమును నభినవాంధ్రభోజులు శ్రీపీఠికాపురాధీశ్వరులు క్రీ. శ. 1931 లో నచ్చువేయించి ప్రకటించిరి.

7. "గజతీర్థమనగా గజేంద్రమోక్షణస్థలము. భాగవతగజేంద్రమోక్షణ కథ సంగ్రహింపఁ బడినది.

తన్మాహాత్మ్యమెఱింగి సేతువునుం జూచుటకుం బయలువెడలిరి. సేతువునొద్ద ధనుష్కోటియందుం గ్రుంగి, రామలింగేశ్వరు దర్శించి మధుర కేతెంచిరి. అచ్చట సోమసుందరు సేవించి యాపై శ్రీరంగపతికిం గైంకర్యముగావించి, తంజాపూరుఁజేరి, దక్షిణద్వారక యగుమన్నారుగుడి వీక్షించి, కుంభకోణము, శ్రీముష్ణము, చిదంబరము దర్శించి, శ్రీతిరుపతి క్షేత్రమున శ్రీవేంకటగురు సపర్యలొనర్చి శ్రీశైలముఁజేరిరి. అచ్చట మల్లికార్జును సేవించి, వింధ్యదాటి శ్రీవారాణసీక్షేత్రమున విశ్వనాథు సంభావించు నంతలో గ్రీష్మమువచ్చెను. ఆగ్రీష్మబాధకోర్చి వారు తమసా నిమ్నగం జేరఁగనే యొక కిరాతుఁ డడ్డపడి వారిని హింసించెను. వారును వానికి తత్త్వబోధచేసి రామమంత్ర ముపదేశించిరి. కిరాతుఁడు బహుదీక్షతో తపముసల్ప, నా తపోభంగముసేయు నింద్రుఁడు రంభోర్వసులఁ బంపిన వారు విఫలమనోరథులై, తిరిగి పోయిరి. అప్పుడు మహర్షులరుదెంచి యాతని తపోనిష్ఠ కాశ్చర్య మనస్కులైరి. ఆతఁడు వాల్మీకమువోలె నైయుండుండి వెడలుటచే వాల్మీకి యయ్యెను. అప్పుడు శ్రీరాముఁడు ప్రత్యక్షమై తన కథను కావ్యముగాఁ జేయుమని యానతిచ్చెను. వాల్మీకి యట్లే రామాయణము రచించి యశశ్శరీరుఁడయ్యెను.

ఇందు మొదటి రెండాశ్వాసములలో క్షేత్రవర్ణనము, తృతీయాశ్వాసమున రంభోర్వశి వివాదఘట్టమున నాట్యవర్ణనము కవికల్పితములు ఈక్షేత్రములన్నింటిని రఘునాథరాయలు

దర్శించినవాఁడు. రామసేతు శ్రీరంగకుంభఘోణాది దివ్యక్షేత్రముల శ్రీరామభద్రుని ప్రతిష్ఠించినవాఁడు. తంజావూరు తనరాజధాని. దానిని వర్ణించి తన స్వదేశాభిమానము కనపరచియున్నాఁడు. ఇట్టీనాట్యకళ రఘునాధరాయునికాలమున నత్యున్నతస్థితిలో నుండెడిది. కావున కథాభాగమున వీనికిఁ బ్రసక్తిగల్పించి రఘునాథుఁడు తన కవితాచాతుర్యముఁజూపినాఁడు. కథయందిట్టిపట్టులు మొత్తముమీఁద మనోహరములైయున్నవి.

ఈరాజకవి కవిత్వము మృదుమధురపదఘటితమై, ధారాశుద్ధిగలిగి ప్రసన్నగంభీరమై యొప్పుచున్నది. కావ్యమంతయు స్వతంత్రముగ రచియింపఁబడినదయ్యు నచ్చటచ్చట కొన్ని ప్రాచీనశ్లోకముల కనువాదములును, ప్రాచీనకవికృత పద్యముల కనుస్మృతులు లేకపోలేదు. మచ్చునకు.

హనుమంతుని వర్ణన కృత్యాది.

ఉ. ఎక్కడ రామకీర్తన మొకించుకయేవిననైన వేడ్కదా
నక్కడ వచ్చి రంజిలి కృతాంజలియై ప్రమదాశ్రుపూరముల్
పిక్కటిలంగ మైఁబులకబృందము జాదుకొనంగఁ బాడుచున్
జొక్కుచు నాడు నయ్యనిలసూనుప్రభానతభానుగొల్చెదన్.
ఇది "యత్ర యత్ర రఘునాదకీర్తనం తత్ర తత్ర కృత మస్త కాంజలిమ్
బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతిం నమతరాక్షసాంతకమ్.
అనుశ్లోకమునకుఁ దెలుఁగుచేత.

సీ. పంకజబంధు బింబస్థాయి త్రైలోక్య
మంగళదాయి శ్రీరంగశాయి
సకలజనానంద సంధాయి గరుడ తు
రంగమయాయి శ్రీరంగశాయి
సహ్యకన్యాతటాంచలకులాయి ప్రపంచ
రక్షణోపాయి శ్రీరంగశాయి
అఖిలదైవత సంసదతిశాయి యగణిత
బ్రహ్మాండకాయి శ్రీరంగశాయి

నిఖిల జగదింద్ర జాలంబు నెఱపుమాయి
అచ్చులకునెల్ల మొదల నచ్చైనవ్రాయి
కొలుచువారల పాలిటి తలఁపురాయి
రావణానుజదాయి శ్రీరంగశాయి. ద్వి. ఆ.
30-౮-

పై పద్యమను ప్రాసఘటితమైయున్నను నిది చదివినతో డనే సంకుసాల నృసింహకవి కవికర్ణరసాయనమున నీక్రింది పద్యము స్మరణకు రాకమానదు.

సీ. అపవర్గకాంతచే నాకొన్నవారికి
దంగేటిజున్ను శ్రీరంగశాయి
నిర్వాణదారిద్ర్య నిర్విణ్ణుఁడగువాని
ముంగిటి శేవధి రంగశాయి

సంసార మలవిమోచనము నాకాంక్షించు
పంగువు పైగంగ రంగశాయి
పరమార్థలాభతత్పరుఁడై నవానికి
ముంగొంగు పసిఁడి శ్రీరంగశాయి
బెదరకాకఁటి యమృతంబుఁ చిదికికొనఁగ
శృంగములు లేని మొదవు శ్రీరంగశాయి
కోరువారలకోర్కు లీఁగోరివచ్చు
జంగమామర తరువు శ్రీరంగశాయి.

అచ్చటచ్చట శబ్దాలంకారములు హృదయంగమమై కవితకుఁ గణన కూర్చుచున్నవి.

క. లోపలఁ జని చని హాటిసీ
లోపలకురువిందకందళోజ్జ్వల కనకా
లోపల సద్రచనాజా
లోపలలితమైన యొక్క యున్నతవేదిన్.

మ. తమసానిమ్నగదాఁటి తజ్జలసముద్యద్బాల శైవాలజా
తమసారద్యుతి తీరభూరుహ విభాధట్టంబుతోఁగూడి సం
తమసానీకముఁబోలె నద్దెసలునిండంజూచి యాహామహా
తమసానీరము నిండెఁ జెల్లదని చింతంజాల బల్గింపుచున్.

ద్వి. ఆ.

వాల్మీకిచరిత్రము స్వతంత్రప్రబంధముగా నెన్నఁదగినది. కవితాప్రౌఢిమయందేమి, కావ్యనిర్మాణమునందేమి, కళాప్రద

ర్శనమునందేమి, ఆంధ్రప్రబంధములో నున్నతస్థానమాక్రమించు చున్నది. రసౌచిత్యవిషయమున దక్షిణాంధ్రవాఙ్మయమున నీ కావ్యమునకుఁ బ్రత్యేకవిశిష్టతకలదు. రఘునాథభూపాలుఁ డుప యోగించిన శబ్దజాలమాతనికి సన్నిహితుడని కుమారసంభవము తోడను శ్రీకృష్ణరాయలవారి యాముక్తముతోడను పరిచయ మున్నట్లు తెలుపుచున్నది. తృణజ్యోతి ఓహారిసాహారిమున్నగు పదములిందులకుఁ బ్రమాణము. 'షగము' మున్నగు నపూ ర్వపద ప్రయోగము లిందు కానఁబడుచున్నవి. రఘునాథభూ పాలుఁడు వైష్ణవుఁడగు శ్రీరామభక్తుఁడయ్యును, పరమతసహిష్ణు తకలవాఁడు. వాల్మీకిచరిత్రమున క్షేత్రవర్ణనమున శైవక్షేత్ర ములఁ గూర్చి చేసినప్రశంస లాతనికిఁ బ్రాచీన శైవవాఙ్మయము నఁగల పాండితిని సూచించుచున్నవి. చూడుఁడు. మధురయందలి సోమసుందరుని వర్ణనము.

సీ. మనుజులకందగరాని మోక్షంబు పక్షికి
దయచేసె నెవ్వాఁడు నయమొనర్ప
వివిధార్థములుగ ద్రావిడసూత్రములు సల
క్షణముగా నెవ్వాఁడు సంగ్రహించె
జంబుకంబులు తురంగంబులుగాఁ జేసి
యన్మై నెవ్వాఁడు పాండ్యాధిపతికి
శ్రుతినిందలకుఁ దామసుల శూలవిద్ధులఁ
గావించె నెవ్వాఁడు ఘనతమెఱయఁ

దట్టఁదలఁబెట్టపట్టెఁడు పిట్టొసంగు
ముసలియవ్వకునై మన్నుమోసె నవ్వఁ
డట్టి లింగస్వరూపున కఖిలపతికి
సోమసుందరునకు నీడు జోడు గలదె.

ద్వి. ఆ.

జంబుకంబులు తురంగములుగా చేయుట, పిట్టవ్వకుఁ దట్టలుమోయుట మున్నగుకథలు దాక్షిణాత్య శైవ వాఙ్మయము తోఁ బరిచయమున్నగాని సాధారణముగఁ దెలియనట్టివి. ఇట్లే తంజావూరు, అరుణాచలము, శ్రీశైలవర్ణనము రఘునాథుని పరమతసహనముఁ దెలుపుచున్నవి. మాధ్వయతియగు సుధీంద్రుఁ డీతనిచే కనకాభిషేకసత్కారముఁ గాంచినవాఁడు. ఇట్లు పరమత సహనముగలిగినవాఁడయ్యు, తనరామభక్తిని గ్రంథమునందుఁ బ్రస్ఫుటముఁ గావించినాఁడు. గజతీర్థమును వర్ణించుపట్టున భాగవతగజేంద్రమోక్షణకథను సంక్షేపముగఁ భావగర్భితముగ జెప్పియున్నాఁడు. కథయందు ప్రసక్తి లేకపోయినను, తన కాలమున తానత్యున్నత స్థితికిఁదెచ్చిన నాట్యకళా, సంగీతకళావిశేషముల నీగ్రంథమునఁ దృతీయాశ్వాసమున వివరించినాఁడు. పుట్టతేనియపోలిక నిట్టలంపుఁ దీయఁదనముఁగలిగిన తెలుఁగు బాసయందు బుట్టఁబుట్టువు మనుగడను నీరాచకయిసరి వ్రాసి, తను గొల్చువేల్పునకు నీకబ్బపుఁగన్నెనిచ్చి యెల్లకడల నెల్లవేళలఁ దెలుఁగువారిలో నెలకొనిన పేరుగడించినాఁడు. మహోదాత్తమై,

శత్రుజేతయై, కృతిప్రణేతయై, శరణాగతత్రాతయై, గాంధర్వవిద్యాధిష్ఠాతయై కవిపండిత హృదయసంస్థాతయగు నీరఘునాథభూనేతచరిత్రము బంగారునీట లిఖింపదగినది. రాజకవీంద్రకృతమై కవిరాజసమ్మానితమగు నీకృతిని యాంధ్రమహాజనులాదరింతురుగాత !

పీఠికాపురము,<br>
విక్రమజ్యేష్ఠ

నిడదవోలు వేంకటరావు, బి. ఏ.

శ్రీరస్తు.

# వాల్మీకి చరిత్రము.

## ప్రథమాశ్వాసము.



వైదేహీయురోజపూర్ణకలశీ
శృంగంబులం బల్లవ
శ్రీవిన్యాసముఁ జూపు హస్తములచేఁ
బ్రేమం బ్రకాశంబుగా
శ్రీవిద్యల్ శతకోటి కిచ్చు నలరాజీవాక్షుఁ డిక్ష్వాకువం
శావిఖ్యాతమహార్ఘరత్నము మదీయాభీష్టముల్ సేయుతన్.

సీ. కమలగర్భాండభాండము లఖండజ్యోతి
నెసయు బంగరుబొమ్మరిండ్లు గాఁగ
నీరేడులోకంబు లెడనెడఁ జెన్నారు
పన్నారుదొంతులబాగు గాఁగ
బ్రహ్మాదిసర్వగీర్వాణసంఘము లెల్ల
నాడించు బొమ్మలజాడ గాఁగఁ
బార్వతీభారతీప్రముఖాదిశక్తులు
ప్రియమిచ్చు చెలిమికత్తియలు గాఁగ
దలఁపున జనకునింట నుదారమహిమ
బాలలీలలు సలిపె నేభామ యట్టి
రత్నగర్భయనుంగు గారాపుఁబట్టి
మమ్ముఁ జేపట్టి సుఖలీల మనుచుఁగాత.

## ప్రథమాశ్వాసము.

క. రాణించు నెపుడు నంత
ర్వాణిమనోబ్జముల వివిధవాణీకృతి నా
వీణాపుస్తకపాణిని
వాణిని ద్రుహిణముఖరంగవాణిని దలఁతున్.

క. ఆదికవుల వాల్మీకుల
వేదవ్యాసులఁ దలంచి వివిధాగమసం
వేదితఁ గట్టిఁడియగు కవి
తాదక్షవిలాసుఁ గాళిదాసు నుతింతున్. 9

క. భామహసీయుల రుద్రట
భామహభవభూతిబాణభాసముఖకవి
గ్రామణులం గవితాబ్జన
భోమణులం దలఁచి మ్రొక్కి పూజింతు మదిన్. 10

ఉ. లక్షణలక్ష్యకోటి పదిలంబుగ మేటికవుల్ నుతింప శ్లో
దక్షమసంస్కృతాంధ్రకవితాపదవిన్ వహి కెక్కి, శబ్దవై
చక్షణి మించుచున్నని విశారదుఁడై తగుతిక్కయజ్వ ఫా
లేక్షణభక్తిశీలుఁ డగునెఱ్ఱయప్రెగ్గడ నేఁ దలంచెదన్. 11

శా. సందర్భంబు నవార్థగర్భమగుచుం జాటుక్రియన్ మించగాఁ
జంపుల్ ద్రొక్కుచు నిండిమంతటరసశ్రీ మెచ్చుగొల్పంగనా
నందాంభోధితరంగముల్ వలెఁబ్రబంధంబుల్ భువిన్నిల్పి దా
నం దెల్లంబుగఁ గీర్తిగాంచి మనుశ్రీనాథున్ మదిం గొల్చెదన్.

చ. తెనుఁగు తెలుంగుసంస్కృతముతీరుదుగానియసహ్యయోగముల్
పెనచినకబ్బముల్ సభలఁ బెక్కుతికంబుగఁ దెచ్చి పెద్దలన్
విను మనువారు నేరుపున వింతలు వింటిమి నేఁ డటం చన
న్విన నుతియించు నెంచు కుకవిప్రకరంబుల మెచ్చ నర్హమే? 13

గీ. యతియుఁ బ్రాసంబు దప్పనియంతమాత్ర
మునకె తన్నును దా మెచ్చికొనెడువానిఁ
బోటి సేతురె? రసపదిపాటిఁ దేట
మాటలఁ గవిత్వము ఘటించు మేటికవులు. 14

*క. చెప్పవలెఁ గప్పురంబులు
కుప్పలుగాఁ బోసినట్లు, కుంకుమ పైపై
గుప్పినక్రియ, విరిపొట్లము
విప్పినగతి ఘుమ్మనంగ గవిత్వము సభలన్. 15

క. చెవులకుఁ జవులై, చల్లఁగఁ
గవులకుఁ దవులై, సమస్త కావ్యకళాబం
ధువులై, రససింధువులై
యవురా ! యనఁ గవిత లవని నలరఁగ వలదా ? 16

వ. అని యిష్టదేవతాభివాదనంబును బురాతనాధునాతనసుకవి
గుణానుమోదనంబును గుకవిమదహంకృతిభేదనంబును సద
సత్కవిత్వతత్త్వానువాదనంబును గావించి, యేనొక్క కావ్యంబు
(నవ్యోద్యమనవ్యార్థచమత్కారభవ్యంబును) సకలవిద్వత్కవి
శ్రావ్యంబునుంగాఁ జేయ నూహించియున్నచో నొక్కనాఁడు, 17

* ఈపద్యము లక్షణదీపికలో నుదాహరింపఁబడినది.

## ప్రథమాశ్వాసము.

సీ. మెఱుపుపచ్చనిదట్టి యొఱపుగాఁ గటిఁ గట్టి
యపరంజిపిడి పిడియంబుఁ జెక్కి
కట్టివి ల్లొక చేతఁ బట్టి వేఱొక చేతఁ
గోలిమించిలకోరికోలఁబూని
రాణించు గొప్పసుప్పాణిమొంటులఁ దాల్చి
తరమైనబలుకెంపు తాళి వైచి
మణికిరీటముడంబు మెఱపించునొకవింత
లాగి యాలోని కుళ్ళాయి వెట్టి
యొక్కచక్కనిజవరాలు నొక్కపిన్న
వయసు రాకొమరుఁడు నిరువంకఁ గొలువ
పెడఁదకన్నులవాఁ డొక పుడమిఱేఁడు
నేఁడు నినుఁ బ్రోతు నని చాల నిలిచె ప్రోల.

క. నిలిచిన నేనును నంగము
పులకించుచు నుండ నాత్మఁ బొంగుచు నతనిం
గలలోనన కనుఁగొని నా
కులదైవం బైన యలరఘుపతియె యనుచున్.

గీ. మేను పులకింపఁగాఁ బ్రణమిల్లి నిలిచి
యున్న ననుఁ జూచి య ప్పురుషోత్తముండు
మందహాసాంచితముఖారవిందుఁ డగుచు
వత్స రమ్మని వత్సలత్వమునఁ బలికె.

ఉ. నీకవితావిలాసము గణింప సుధారసధారకంటె నిం
పైకనిపించు, దానఁ గృతిపైనను మిక్కిలిసొంపు నింపదే
*నాకథఁ గొల్లియర్థరచనారుచి మించఁగఁజెప్పి; తద్వా
ల్మీకిచరిత్రము౯ నొసఁగు మెచ్చఁగ నీ విపు డచ్యుతాత్మజా! 21

క. పావన రమణీయంబగు
నా వాల్మీకులచరిత్ర మది కృపసేయు౯
ఠీవి మెఱయు నీపుణ్య
ప్రావీణ్యము యమ్య శౌండ రఘునాథనృపా! 22

క. అని యానతిచ్చి చన నే
ల్కని యే నెంతటి యంతకమహాత్మ్యుఁడనే
యని యా రఘువల్లభుని౯
వినుతించి ప్రభాతవేళ వేగన మేలుకొను౯. 23

వ. కొలుపు కూటంబున కేతెంచి విబుధోత్తములకుం జెప్పిన వారు నిది శోభనస్వప్నంబపారకరుణాసముద్రుండగు రామభద్రుండు నీనిజభక్తికి మెచ్చి కృపసేయు మని యానతిచ్చెం గావున నీకవితావిశేషంబు సకలలోకప్రసిద్ధంబగు నని సంతసించి పలికిన నేను నవ్వాల్మీకిచరిత్రంబు సేయసమకట్టి తత్ప్ర

(*) ఇతఁడు రామాయణ మనుకృతి నతియుపారముగా సవాల్మీకముగా రచించియున్నాఁడు. దానినే మధురవాణి యనువేశ్యాతిలకము సంస్కృతమున ననువాదముచేసెను. దీనిలో బాలకాండమునందే 3000 పద్యములు గలవు

సాదలబ్ధం బగు కవిత్వంబు తదధీనంబుగాఁ జేయుట యుచితం
బని విచారించి యద్దేవతాసార్వభౌమునకును. 24

క. బర్హిణకంఠచ్ఛాయా
గర్హణచణకాయునకు, జగద్గేయునకుఁ,
బర్హిర్ముఖమకుటీ ఘటి
తార్హణచరణునకు, ఘనకృపాభరణునకున్. 25

క. రక్షోవక్షోఽసృ గ్గస
కుక్షింభర నిశితసాయకునకుఁ, మిథిలా
ధ్యక్షసుతానాయకునకుఁ,
బ్రత్యక్షస్తుతనామునకు, దయాధామునకున్. 26

క. భీషణ ఘోషణ జలనిధి
శోషణశరధారునకు, నసూయామాయా
ద్వేషణ భాషణ ఖరఖర
దూషణ పేషణపటిష్ఠదోస్సారునకున్. 27

క. వైదేహీ మిత్రునకుఁ,
సాధిత శత్రునకు, సప్తసాలమహీరు
డ్భేదనపటుశరునకు, హర
కోదండవిఖండనావికుంఠకరునకున్. 8

క. మార్తాండవంశపావన
మూర్తికి, నవహారచంద్రమహోహీరలస
త్కీర్తికి, మానిమనోంత
ర్వర్తి శుభాకారునకును, రఘువీరునకున్. 29

వ. సమర్పితంబుగా నాయొనర్పం బూనిన వాల్మీకిచరిత్రం బను ప్రబంధరత్నంబునకుం గథాసూత్రం బెట్టి దనిన. 30

క. శ్రీవరచరణాంభోజ ర
జోవాసితమగుచు నలరు సుకృతి నికర సం
జీవనము పావనము బద
రీవనము విముక్తి సుందరీయావసమై.

మ. నరుఁడుందానునుగ్రీడసల్పునెపుడుఁ నారాయణుం డవ్వనిన్
వరమౌనివ్రజయాగభాగముల నాస్వాదించుచుఁ మంత్రనా
క్పరిపూతాహుతిధూమగంధముల నాఘ్రాణించుచుం డోత్రభా
సురదిగ్రామగసామగానములు వించుఁ నిత్యసంతుష్టుఁడై. 32

సీ. ఒక్కనాఁడైనను జక్కఁగాఁ గనువిచ్చి
బెళుకుఁ జూపులఁ జూచుప్రేమ లేక
వేడుకకైనను వెకలినవ్వులు మీఱ
నటనఁ జూపట్టఁ బల్కుటయు లేక
యుబుసుఁ బోకకునైన నుల్లంబు పల్లఁగా
గందంబలందెడు పొందు లేక
నెలకైనఁ గొంతయాఁకలి దీఱఁ గలమాన్న
కబళ మొక్కటి జిహ్వకమియు లేక

గీ. సలఁగి యెండల నెండి, వానలను దడిసి,
మోహ మనుత్రోవ యెఱుఁగక దేహమాత్ర
ధారులైనట్టి యచ్చటి తపసులెపుడు
వలవ జేయుదు రల ముక్తి లలనఁ గోరి.

చ. శమదము లైన యమ్మునుల, శాసన మెట్టిదొ గాని, కానలం
దమతమయిచ్చఁ బచ్చికలు ద్రచ్చి వెసం జను హోమధేను సం
ఘములకు గోపబాలకుల కైవడి నేరిమి వాలవాలదం
డముల నదల్చి తెచ్చు మగుడం బులు లచ్చటనిల్చి మచ్చికన్. 34

ఉ. బాలరసాలసాలముఖపాదపరాజికిఁ బూని మౌనిరా
డ్బాలికలందు సైకత ఘటంబులచే సలిలంబు వోయఁగాఁ
గాలువ దీర్చుఁ దిన్నఁగ నఖంబుల మన్నులు గీరిగీరి యా
వాలములందు నెక్కఁగఁ బ్లవంగమసంఘము లేమి చెప్పఁగన్. 35

మ. తుహినాహార్యగుహాగృహామరసరిత్పూరంబు లుద్యత్పళిం
దహాతక్రోడవిభిన్న ఘోణభవము ల్కాపాలికల్ దెచ్చి త
న్మహినిండించఁగ మౌనికన్యకలు ప్రేమ న్రేఁగుఁబం డ్లేఱుచు న్
రహిమైఁ గూడఁగ నేఱి తారొడుల నిండన్నింతు రెంతేతమిన్. 36

గీ. గజము లుటజాంగణంబులఁ గరములఁ గొని
దినము నివ్వరి*యన్నులు దెచ్చి వైవ
నవి కపులు గోళ్ళ నొలిచి బియ్యంబు సేయు
మునుల హవిరన్న వేళకు ననువుగాఁగ.

క. గంభీరహ్రదములలో
నంభస్సులు ముంచి యిచ్చు హస్తంబులచేఁ
గుంభీంద్రమ్ములు మునికుల
కుంభిగమన లొసఁగు నీరు కుండలనిండన్. 38

---

*"అన్ను" అనుటకు "అవియఁదోచినయట్టియన్నతోడ" క్రీడాభిరామము.

క. నారాయణుండు సాక్షా
త్కారంబున నతిథివోలెఁ గ్రతుభాగంబుల్
కోరికిఁ గయికొనునఁట యట
నారయఁ దన్మునుల భాగ్య మలవియె పొగడన్

గీ. అవ్వనంబున శౌనకాద్యఖిల మునులు
మునులఁ బుణ్యవివర్తాపఘనులఁ గూడి
హరికథామృతలహరి నందంద చాల
నోలలాడుచు నుండెడు వేళయందు.

సీ. నారాయణునిదివ్య నామావళులు పల్కు
మహతిఁ దామూఁపున రహింపహింపఁ
బవడంపు నునుగెంపుఁ బగటు కెంజడగుంపు
జిగియాకసపుఁ జెట్టుఁ జిగురుగోలుపఁ
గేల్దమ్మిఁ బొడమువూ త్తికపం క్తి యమర నవ
స్ఫటికాక్షసరము సంభ్రమము నూపఁ
బ్రతిదినస్నానసంగతమైనగంగాంబు
పాండిమం బసఁ దనప్రభ నెలంగ

గీ. విష్ణుభక్తులె ఘనులు భావింప ననుచు
బిరుదుపూనెనో యనఁ గుంచె కరమునందు
నమరఁగా నంత నంతరిక్షమున వచ్చె
నారదుఁడు తత్త్వబోధవిశారదుండు.

# ప్రథమాశ్వాసము.

క. వచ్చిన నమ్మునులెల్లను
హెచ్చినతమితోడ నతని కెదురేగి వెసం
దెచ్చి యతి కర్ఘ్యపాద్యము
లిచ్చి యుచితపీఠి నుంచ నెలమి నతండున్.

సీ. శౌనకా సుఖమె, విశ్వామిత్ర లెస్సలా,
కణ్వ మంచిదియె, భార్గవ శుభంబె,
సుతపరిణామంబె, సుతప సంతోషంబె,
చ్యవన క్షేమమె, పరాశర శివంబె,
కపిల మంగళమె, మార్కండేయ కుశలమే,
వత్స సౌఖ్యమె, కాత్స్య యుత్సవంబె,
మాండవ్యభవ్యమే, మైత్రేయ భద్రంబె,
సుబల మేలే, వశిష్ఠ శోభనంబె,

గీ. క్రతు, భరద్వాజ, గౌతమ, కశ్య, పాత్రి
కలశసంభవ, కౌండిన్య, గర్గ, మంద
పాల, జాబాలి, రోమశప్రముఖులార!
యారలానందముగ నున్నవారె యిచట?

క. అనుచుం గుశలప్రశ్నం
బొనరించిన మౌనులెల్ల నుల్లము లలరం
వినుతు లొనరించి సురముని
కని రిట్టులు వినయమున్ సమయంబును బెరయన్.

క. నారద ! బ్రహ్మజ్ఞానవి
శారద ! శారదపయోదసన్నిభదేహా !
సారదయా ! నిజతేజో
దూరదళితదురితభయ ! చతుర్ముఖతనయా! 45

క. బహుళబ్రహ్మాండంబుల
బహిరంతర్గతము లగు ప్రపంచంబుల యం
దహరహము విశృంఖలగతి
మహిమఁ జరింపుదువుగాదె మహితవిచారా ! 46

క. కావున నీ విశ్వమునం
దీ వెఱుఁగనికథలు లేవు; ఋషికులతిలకా
భావించి చెవులు ఝల్లఁగ
శ్రీవిష్ణుస్మరణకథ వచింపుము మాకున్. 47

చ. అని యిటు లామునిప్రవరు లందఱు మోదము నిక్క నొక్కత్రి
తున మురఘస్మరస్మరణరూపకథాశ్రవణానుషంగు లై
వినుతి యొనర్ప, నాతఁ డతివిస్మయవిస్మయమానవక్త్రుఁ డై
వనజదళాక్షు భక్తజనవత్సలు నెమ్మదిలోఁ దలంచుచున్. 48

చ. పులకలు మేనజాదుకొనఁ బొంగుచుమాటికిహర్ష బాష్పముల్
జలజలఁజిందఁగా హరితలంపునఁ జిందులుద్రొక్కఁ గొంతసే
పలయికవోలె నైమఱచి యంతటఁగన్నులువిచ్చిచూచెమా
ను లడిగినట్ల యర్థము మనోగతమాటకు నిచ్చుమెచ్చుచున్. 49

క. మునులార! మీర లొనరిం
చిన యీ ప్రశ్నము పురాణసిద్ధము శుద్ధం
బనఘ మమోఘంబు శుభం
బ నితరజనసులభ మైతిహాసిక మరయన్. 50

వ. అని పలికి తత్సమీపంబునఁ బర్వతుం జూపి యితండు మత్సఖుం డితనికి విష్ణుకథారహస్యంబులు కరతలామలకంబుగాఁ దెలియు వినుండు నేనిదే రమావల్లభుసేవకుం బోయి వచ్చెద నని వారల వీడుకొని నారదుం డరిగిన యనంతరంబ, శౌనకాదు లత్యంతహర్షంబున నప్పర్వతమహర్షిం జూచి నారాయణస్మరణమహిమానుభావంబు వివరింపుమని యడుగుటయు నప్పర్వతుం డి ట్లని చెప్పందొడంగె. 51

గీ. మౌనులార! నారాయణస్మరణమహిమ
హిమకరకళాధరుం డొకయించుకంత
మెఱుఁగు నసి విండుమదియును నెఱుఁగలేరు
బ్రహ్మాదిక్పాలసురమునిప్రవరులెందు. 5

గీ. పరమమునులార! శ్రీహరిస్మరణరూప
కథ యనఁగ నామకీర్తన కథయు నామ
కీర్తనము సేయఁ జేయఁ దన్మూర్తిమెల్ల
యుల్లమునఁ జూడఁజూడ రంజిల్లఁగాన. 53

ఉ. శ్రీహరినామకీర్తన మశేషభవప్రభవాతిమోహ సం
దోహవికర్తనం బని శ్రుతుల్ మొఱవెట్టఁగ వించు వెండి సం
దేహముపోఁక మూఢులగతిం బెడఁబాతురు కర్మవార్ధులం
దోహరిసాహరిక్ మునుఁగి యొల్లరు దీని ప్రచింత యేమనన్. 54

లయగ్రాహి.

క్షేమము శ్రుతిప్రకర సీమము సమస్తగుణ
ధామము నిశాటకుల భీమము మునీంద్ర
ప్రేమము మహాముని లలామము తమోభరవి
రామము నతాళికర హేమము సదర్ధి
స్ధేమము ముఖాభినవ ధూమము విశిష్టతర
హేమము కృతప్రమద భూమము శుభార్ధో
ద్దామము లసద్గతికి దీమము శివాదృశవి
నామము రమాధిపతి నామము జలంపన్. 55

క. ఈహరినామరహస్యం
బూహింపఁగ నర్ధవాదయుక్తులచే సం
దేహించు విష్ణుమార్గ
ద్రోహులకుం దెలుపవలవదు పరాకైనన్. 56

క. పరనిందకుల, కసూయా
పరులకు, శ్రుతివిహితకర్మపరిహారులకుఁ,
హరిచరణభక్తిరహితాం
తరంగులకు, నిది వచింపఁదగ దండ్రు బుధుల్. 57

ప్రథమాశ్వాసము.

క. పాషండుల, కాగమపర
దూషకులకు, నాస్తికులకు, దుష్కృతమార్గా
న్వేషకులకు, నిది చెప్పిన
దోషము గల దనుచుఁ జెప్పుదురు బుధులెల్లన్.

క. ఎవ్వరు విశుద్ధమానసు,
లెవ్వ రఖిలజీవభావహితమతి మనువా
రెవ్వరు సత్యవ్రతపరు
లవ్వారపుణ్యులకు దీని నర్థము వినఁగన్. 59

వ. మునులార మీర లందఱు గోవిందచరణారవిందవందనపరాయణులు నతినిశితధీకుఠారధారాఖండిత గ్రంథులు నూర్ధ్వమంథులు సాత్త్వికులుం దాత్త్వికులుం గావున మీకు నీ హరినామకీర్తన మహత్త్వం బెఱింగిన మాత్రంబ వివరించెద నేతత్ప్రకాశకం బైన యొక్క యితిహాసంబు గలదు, సావధానమతులై వినుం డని యిట్లని చెప్పందొడంగె. 60

సీ. శ్రీకిఁ బుట్టినయిల్లు చింతామణికి గని
యంబుజాక్షునకు శయ్యాగృహంబు
కల్పకవనవాటికలకు నావాలంబు
పాకారిముఖులకుఁ బాకభూమి
కామధేనువులకు గోష్ఠీవ మంబుద
నివహంబునకునుఁ బానీయశాల
విశ్వంభరాదేవి వెలిపట్టుపుట్టంబు
నెలతొల్పు వేల్పున కలరుఁదోఁట

గీ. సలిలపతిబొక్కసము నదీసతులకెల్ల
నర్మసీమంబు గిరులకు వర్మ మనల
తాండవితపాండుడిండీరఖండధాళ
ధళ్యసాంద్రంబు పాలసంద్రంబు మించు. 61

క. ధళధళన మించు నందుం
గలితసుధాఫేనపిండఖండంబులు శ్రీ
లలనామణిమాటల కై
వెలమి నునుచు వెండిబొమ్మరింపు లనంగన్. 62

శా. ఏయేచోటుల నిచ్చయూచచట నే యీనామునైపాన్పు పై
శ్రీమోహాపతి యుండుఁగాకయనుచున్ శేషాహిదాసంతటం
గాయప్ర్యూహము వన్నెనో యనఁగ శంఖశ్రేణి పాణింధమ
చ్ఛాయాచ్ఛాయతకీతినం దలరుఁ జంచల్లోలకల్లోలముల్

ఉ. వ్రాలి జలంబుఁ గ్రోలుఘనవారిదపంక్తులలోఁ దళుక్కునం
గ్రాలుమెఱుంగుఁ దీగియలుగన్గొన నొప్పుచునుండునందు నె
క్కాలము వీచిగర్భములఁ గమ్మఱఁ గమ్మఱఁ బట్టుసప్సరస్
స్త్రీలన నెల్లచో నస ధరిణధురీణవిలాసమూర్తులై. 64

చ. ఘనబడబాగ్నికీలములఁ గ్రాఁగి యభంగతరంగ సైతవం
బునవెసనింగివెన్నొరయఁబొంగి చెలంగుబయఃప్రపూరముల్
దినదినమున్ సమాగతనదీజలయుక్తి నడంగు నంద కా
క నిమిషమాత్ర మున్నను జగంబుల నొక్కట నాక్రమింపదే? 65

ఉ. పన్నగశాయి నాభిసిత పంకరుహాపరిభాగపీఠి మై
నున్న చతుర్ముఖుండుబలెనుండుదమంచుఁదలంచియందు దా
రున్నతఫేనకూటముల నోహరిసాహరి నెక్కి తేలుచుం
జన్నపయోధరార్భకుల సారె నగుం వరుణావరోధముల్.

క. ఆపాలకడలినడుమం
దీపించుత జగదఖండ దీపముఁ దేజో
రూపంబు నగుచు శ్వేత
ద్వీపము నానావిధోపధిదురాపంబై.

క. జ్వలదౌర్వానలశిఖలం
గలశపయోరాశి గ్రాఁగఁగా నట నడుమం
దలముగఁ బట్టిన మీఁగడ
వలెఁ దెల్లనిదీవి కీవిఁ బరఁగుచునుంమన్.

సీ. తరిఁగొండచేఁ బ్రచ్యుతతిఁ దేలి యొక్కెడి
క్కునఁ జేరు నవనీతకూట మనఁగ
మథనపరిశ్రాంతి మైఁ జుట్టచుట్టిన
వాసుకి ఘనభోగవలయ మనఁగఁ
దరఁగల నానాటఁ దఱచుగానొక్కెడఁ
బెట్టిన ముత్తెంపుఁ దెట్టువనఁగ
జలనిధిరాజు వక్షస్థలంబునఁ జాలఁ
బసమీఱు వజ్రంపుఁ బతక మనఁగ

నీరనిధికన్యకామణి నీడచూడ
నచట నిల్పిన నిద్దంపుటద్ద మనఁగ
ధవళకాంతిప్రలిప్తదిగ్దశకమగుచుఁ
దేజరిలుచుండుఁ దగుఠీవిఁ దెల్లదీవి. 69

ఉ. ఆతెలిదీవి శ్రీవిభుఁజూచియుఁ దా రయమొప్పఁ దరంగమాలికా
నీతములైన ముత్తెములు నిచ్చలుఁ బైపయి నాఁడు ముత్తెసం
జాతదళాయతాక్షి ఘనసంభ్రమ మొప్ప ముముక్షుమూర్తులై
*చే తనఁబ్రాలు వోయుగతి శీతసమీరసమీరితంబులై. 70
71

వ. అందు.

సీ. శ్రీభామినీశ్వాసచిత్రపాదన్యాస
ధన్యాసమానసౌధవ్రజంబు
సప్తసమస్వరోచ్చారణాజ్ఞమనోజ్ఞ
కీరశారీశాలికేలివనము
రథ్యాసహస్రతోరణబద్ధకల్పక
ప్రసవజాలసుగంధబంధురంబు
రవిసుధాంశూపాధిరహితనిత్యోజ్జ్వల
నైజతేజోభరభాసితంబుఁ

---

* "చేతనఁబ్రాలు" అనుటకు:—

కలయం గాడ్పునఁ దూలి పుప్పొడి జివిం గప్పారుచుండున్ జే
డ్కల నారామసమావసంతుఁడు గదంచుం బెట్టి సేయించుచో
నలయంబట్టిన యుల్లభంబు పసిఁడిన్ వేమారు వర్షంబునై
జెలువొందించుచు రాలుఁ బుష్పవితతుల్ చేసన్న బ్రాలో యనన్.

విష్ణుకోట పెద్దన ప్రద్యుమ్నచరిత్రము.

ప్రథమాశ్వాసము.

జటులకరచక్రచండప్రచండశక్ర
కుముదకుముదాక్షుగణపతిప్రముఖబాహు
దండపాలితమణిగణాదండరుచిర
గోపురము మీఱుచుండు వైకుంఠపురము.

క. శ్రీరమణనాభికుహరస
రోరుహసద్గంధలహరి రోసి చరించున్
సారెకు నచ్చట శిశిరస
మీరము లఖిలైకసుఖము మీఱఁగ నెపుడున్.

సీ. శ్రీవత్సకౌస్తుభశ్రీలఁ బూననివారుఁ
గుడుసుఁగైదువలు సేకొననివారు
ఘనఘనాఘననిభాంగముల మించనివారు
పసిఁడిదుప్పటులఁ జొప్పడనివారు
జలజ నందక శార్ఙ్గములఁ ధరింపనివారు
నడుగుల మిన్నేఱు నిడనివారుఁ
గమనీయభుజచతుష్కంబుఁ దాల్పనివారుఁ
బులుఁగుగొల్లని నెక్కి పోనివారు
వెడఁదకన్నులఁ గృప యుట్టిపడఁగ నెపుడు
భక్తసంతతిఁ బ్రోవఁ బాల్పడనివారు
లేరు వెదకిన నప్పురి సారసాక్షు
సారసారూప్యములుగన్నవార కాని.

క. అందు ముకుందుండు మణిమయ
మందిరమున నుండుఁ గోటిమన్మథశోభా
కందళితరూపరేఖా
సుందరుఁ డై, రమయుఁ దాను సుఖతరలీలన్. 75

క. శ్రీతరుణీపతిఁ జూడఁగ
నాతెలిదీవికిని దీర్ఘయాత్రాపరు లై
యేతెంచిరి సత్పురుషులు
నాతతహర్షులయి లీల నట యొకవేళన్. 76

క. ఏతెంచి యచటి మహిమలు
చేతోమోదంబు లుల్లసిలఁ గనుఁగొనుచున్
నూతనమణిఘృణిజాత
ప్రోతం బగు హరిహజారముం జొచ్చితగన్. 77

మ. సరసీజాసనవాసవాదిసుమనస్సంఘంబు సన్మౌనులున్
సారదిఙ్మౌనిజను చావను ల్గడచి మెచ్చుల్ వచ్చు గంధర్వకి
న్నరగానంబుల తాసమానముల నానందంబు నొందించుచుం
దిరమౌ నొక్కవిలాసమందిరము గాన్పించంగనీక్షించుచున్. 78

క. లోపలఁ జనిచని హరి నీ
లోపలకురువిందకందళోజ్జ్వల *కనకా
లోపలసద్రచనాజా
లోపలలిత మైన యొక్కయున్నతవేదిన్. 79

* కనకాలోప=బంగారులోపములేనిది.

## ప్రథమాశ్వాసము.

సీ. కౌస్తుభమణి గన్న కనకంపుబొమ్మనా
వనధికన్యక యురంబునఁ జెలంగ
విమలాదికాంతలు వెన్కఁ గంకణనిక్వ
ణము మించ వింజామరములు వీవ
నిలయు నీళయుఁ బాదనళినముల్ గుబ్బచ
న్నటువులఁ జేర్చి యందముగ నొత్తఁ
దెలిదమ్మిరేకుల తేటఁజూపఁగఁజాలు
వాలుగన్నులఁ గృపప్రవేలుచుండ

మాటికిని శేషనిశ్వాసమారుతములఁ
గుందనపుఁజేలచెఱఁగు లందందఁగలయ
మృదులతరభోగభాగంబుమీఁదఁ బవ్వ
ళించి, చిఱునవ్వు చెక్కుల నించువాని.

సీ. మకరతశ్యామకోమలవిగ్రహము వాని
మకరకుండలదీప్తిమహిమ వాని
మకరాంకకోటిజిన్మధురరూపము వాని
మకరాకరోరుసద్మంబు వాని
మకరభిచ్చక్రభీమకరాంబుజము వాని
మకరార్కదుస్సహమహము వాని
మకరందనిష్యందమానితోక్తులవాని
మకరాదివేయినామములవాని

యాడః విరాడ్రూపముం జట్టియుం జోఁకవై వారిరాశిం ద్రయీ
చోరకుం జీరియున్, మేటితామేటివై మూఁపునన్మందరగ్రావ
మున్ మోచియున్, ఘోణివై కొమ్మునం బూని యీక్షోణి
రక్షించి, మాయాతిదక్షున్ హిరణ్యాక్షు శిక్షించియున్ సామి
హర్యక్షమై నీపదాపేక్షమై యున్న ప్రహ్లాదు నాహ్లాదముం బాపు
దుష్ప్రాపునానాసురాలాపు ముమ్మాపుదగ్రాయసోగ్రాతిజాగ్ర
న్నఖాగ్రంబులం జించియుం బొట్టివై, మెట్టి వైరోచనిం గిట్టియుం,
భార్గవాకారముం బూని దోర్గర్వఖ్యాతి సంవర్గణోద్దండభూ
రాచతండంబులం గండ్రగొడ్డంట ముయ్యేడుమారుల్ వడిం
జెండియున్ రామరూపంబునన్ నిల్చి, నీపాదసేవల్ ప్రసాదింపు
మోదేవతాసార్వభౌమా! పవిత్రైకనామా! ఘనశ్యామ!
శ్రీరామ! హస్తీకృతశ్రీ విహస్తేంద్రవైరీ నమస్తే హితార్థప్రదా
నా నమస్తే నమస్తే నమస్తే యటంచు న్నుతింపన్. 82

క. అమ్మనుల నుతిరవమ్ముల
నెమ్మన మలరంగ నపుడు నీరజనాభుం
డమ్మణిమయమందిరమ
ధ్యమ్మున నున్నట్లయుండి యాశ్చర్యముగన్. 83

బాలాతపము నింగిపైఁ బర్వగతిఁ గటి
విలుగట్టు వన్నియవలువ వెలయ
దృక్కోణకరుణాబ్ధి కెరలెక్కు మకరయు
గళమున మకరకుండలము లలర

గళశంఖమునను జొక్కపుముత్తియంబుల
లీల నక్షత్రమాలిక చెలంగఁ
బాణిపద్మంబుల రాణించు నాళంబు
లనఁగఁ గోదండసాయకము లుండ
మది వెడలి నిల్చు చంద్రబింబం బనంగ
నురమునందనఁ గౌస్తుభ మొఱపు నెఱపఁ
బచ్చరామానికపు జగిపగ టనంగ
నమరవారల ప్రోలఁ బ్రత్యక్షమయ్యె.

క. ప్రత్యక్షంబై కనుఁగొని
ప్రత్యక్షరవిలసదమృతరసయుక్తములౌ
నత్యంతసుమధురోక్తుల
నృత్యన్మణికుండలుండయి దయం బలికెన్.

గీ. పరమపావనమైన మీ పారమార్థి
కస్తుతికి నిచ్చ మెచ్చితిఁ గలశజలధి
యందుబలెనే నేను మీమానసాంతరమున
నెపుడు వసియింతుఁ జనుఁడు మునీంద్రులార!

గీ. అనుచు హరి పల్కుటయు విని మునివతంసు
లద్భుతోత్కర్ష హర్షాబ్ధియందుఁ దేలి
యింతకరుణాంతరంగుఁడవే యటంచు
మఱియుమఱియును మ్రొక్కి రమ్మాధవునకు.

ఇవ్విధంబున నమ్మహర్షులు సహాసహర్షు లగుచు నకారణ కరుణాపరాయణుం డగు నారాయణు సేవించి తన్మూర్తి భావించుచు నప్పాలకిడలి వెడలితత్పయోనిధానసుధాతరంగ ఘటఘటాయితవర్షిష్ణు గగనతరుస్పర్ధి వేలావనమాలాప్రసవ జాల లోలంబక ప్రాలంబానుబంధి మందరగంధవహాడింభ సంభ్రమవిలాసపచేళిమసస్యలోకంబగు శాకద్వీపంబునకు వచ్చి యచ్చట, నిశాట నోరుశృంగ బలభద్ర శతకేసర దేవ పాలంబు లనుపుణ్యశైలంబులుమెట్టి, యందులం బుట్టిప్రవ హించు ననఘయు నాయుర్దయు సరోంతయుఁ బంచపదియు సహస్రద్యుతియు నిర్జరద్యుతియు ననునిమ్నగలఁ దానంబులు గావించి, దధిమండల సముద్దండగండకావళిహిండనోచ్చా లితఖండ శీకరషండ తాండవ గగనపుండరీక భ్రాంతిసంబోధి యగు దధిమహాంభోధి యుత్తరించి, పంచాక్షరీప్రపంచిత పంచవదనసాక్షాత్కార నిర్వంచన పంచజనోదంచితం బగు క్రౌంచద్వీపంబునకు డిగి, తదభ్యంతరంబున వర్ధమానోప బర్హణ నందోపనందన సర్వతోభద్రాది సీమభూమీధరం బులు దర్శించుచుఁ దత్పార్శ్వంబుల నభయయు నమృ తాగయు నార్యకయుఁ దీర్ఘపతియు నను నదులనాడి యనం తరంబ నిరంతరాజ్యరసచ్ఛురణ పిచ్ఛిలకుక్షిగత కులక్షితిధ రాగ్రలగ్నమహీరుహ ఫలగ్రహణ మోహారోహి ముహు ర్ముహుశ్చ్యవమాన జలమానవడింభ సంరంభావలోకన

తారికుంభికోపంబగు శాల్మలీద్వీపంబున కవతరించి, యా సరస స్వరసశతశృంగవామదేవకుంద ముకుంద పుష్పవర్షాది మేదినీధరంబులు దర్శించుచు, నాదండ నుద్దండపాపచ్ఛటాచ్ఛేదనంబులు సేయునసుమతియు సినీవాలియు సరస్వతియు రజనియు రాకయు నందయు నను తరంగిణుల మునింగి యుప్పొంగి నుతియించుచు, నిరంతర మధురమధురసాసార సమృద్ధివివృద్ధతర భోగజడభావసంపర్కాప నోదన శర్కరాపరియాత సంతతవ్యావర్తన చరజ్జరదజగర నికరభూరి ఫూత్కారజాత వాతోద్ధూత భూధరవ్రాత కందలితకందుకఖేలనా చరిత ఖేచరాక్షి మోదంబగు నిక్షూదంబుఁగడచి నడచి,బంధురస్కంధపటలనటజ్జటాచ్ఛటాచ్ఛాదిదిఙ్మండలాఖండితాఖండ తాండవఖండపరశురేఖావిడంబనడంబరాభ్రంలిహ మహాలక్షిత హిరణ్మయ ప్లక్షం బగు ప్లక్షద్వీపంబు నకువచ్చి, యచ్ఛోట మణికూట వజ్రకూట జ్యోతిష్మతీంద్రసేన సువర్ణహిరణ్యష్ఠీవ మేఘమాలంబులను సేతుశైలంబులుచూచి యరుణోదయు నాంగిరసయు సుప్రభాతయు సత్యంభరయు ననునదులం దీర్థంబులాడి, యవ్వలం గడలి, మద్యత్తిమితిమింగల ఘులీగాఢసలిలో పరిపరి ఢాక మాన జరఠగూఢపాత్రప్రకల్పితాపూర్వ మత్స్యస్థల స్థూలతరతరంగసంగనిర్ణిద్రం బగు లవణసముద్రం బతిక్రమించి, మహామేరు క్షోణిధర దక్షిణతటలక్షిత జంబూవృక్షగళద

సద్వృక్షఫలప్రవాహామరుత్తరంగిణీ పంకాయమానా కలంక
జాంబూనద సంపాదితాగణ్య పుణ్యస్వరూపం బగుజంబూ
ద్వీపంబుఁ బ్రవేశించి, యంత. ౮౮

సీ. మలయశైలనితంబవలయ చందనలతా
నిలయవైభవము వర్ణించుకొనుచు
మంగళప్రస్థాభ్రభరంగలగ్నమనోజ్ఞ
శృంగలక్షణము లీక్షించుకొనుచు
మైనాకవివిధప్రసూనసవారానూన
నానాకటకకాననములు గనుచుఁ
హల్లకాచలసరోహల్లకామోద సం
వేల్లితానిలము సేవించుకొనుచుఁ
గుతుక ముప్పొంగ మఱియుఁ ద్రికూట చిత్ర
కూట మణికూట వృషభ కాకుభ మహేంద్ర
వారిధారేంద్రకీలపర్వతము లెల్ల
మెట్టి తత్పుణ్యభూములు చుట్టనుంచి. ౮౯

క. చనిచని కాంచిరి విద్రుమ
వనరాగద్విగుణితాంబువర్ణముచేతం
గననొప్పు తామ్రపర్ణి౯
వననిధివరవర్ణిని౯ నవశ్రీపర్ణిన్. ౯౦

గీ. కాంచి యిది పాండ్యభూపాలకాంచిత మగు
కేళిదీర్ఘిక యిది మంచికెంపురాలు

గలుగుచుండెను గని యిది కలశభవుఁడు
నిత్యసంధ్యావిధులు తీర్చు నెల వటంచు. 92
వ. అందు నందఱుఁ దీర్థంబు లాడి,
క. ఆ తామ్రపర్ణి చెంగట
నా తామ్రప్రచురకిసలయద్యుతి నవ సం
జా తామ్రవరణముల వి
ఖ్యాతంబై మించునట్టి గజతీర్థంబున్. 93
వ. కనుంగొని తత్తటంబున నిల్చి, యందఱు నానందంబు తోడ. 94
సీ. లాలితబాలశైవాలజాలచ్ఛాయ
నీల కాయంబు వన్నియఁ బొసంగఁ
బైనిండఁ బర్విన పద్మపరాగముల్
హాళఁదితాపిత చాయ ననుకరింప
నగ్రజాగ్రద్విసీలాంబుజాత శ్రేణి
చాఁపిన తొండంపు జాడ నమరఁ
బార్శ్వతటోద్దీనపక్షినాదంబులు
ఘంటాఘణాత్కార గరిమఁ బెనుప
మారుతోద్ధూతశీకరమండలంబు
ఘనపమధువిభ్రమము దెల్ప ననవరతముఁ
దనరు గజతీర్థ మనుట సార్థముగఁ జూపె
నద్భుతంబుగ నీసరోజాకరంబు. 95
క. అని పొగడుచు నా చెంగట
ననుపమతపమునఁ జెలంగు నాత్రేయుండా

మునిఁగని, యీతీర్థ గరిమ
మనఘా! వివరింపు మనుచు నతఁ డిట్లనియెన్. 96

చ. కరిణులు గొల్వ నొక్కకరి, గాటపు వేసవిఁ దొల్లి భూధరాం
తరఘనకందరాటవుల దాపుల మేఁపులు మేసి మేసి నై
బిరుసుగ నెండవేఁడిమిఁ దపింపఁగ దెప్పరమైన దప్పిచే
దిరుగుచు నెంతొ నీరు గలతెంకులు గానక దీనకంఠమై. 97

క. మన్నులు శేఁగఁగ నేనుఁగు
మన్నిఁడఁడవిఁబడి యొంటమూపులు ద్రావం
గన్నులఁ బఱచుచు నడియా
స న్నొగులుచు వ్రాత సోలి జాలింబడుచున్. 98

గీ. కొన్ని పెంటియేనుఁగులుఁ దానుశోకమై
మూఁకదప్పి, దప్పిమోము లెంసఁ
జల్లగాలిజాడ మెల్లన యరసి, యా
సరసి దరిని నింపు బెరసి యంత. 99

క. కడుపులునిండఁగ జలముల్
వడిఁగ్రోలెం దొండములను వారక సరసిం
బుడబుడ ముంచుచుఁ బ్రక్కలఁ
గుడియెడమకుఁ జల్లికొనుచుఁ గుంభీంద్రంబుల్. 100

క. నిండార జలముఁద్రావియు
వెండియు వెండియును గడుపు వెలితిగఁ బైపై
నొండొండ గ్రోలి జలరుహ
షండంబులతోడ గ్రీడ సల్పుచునుండన్. 101

## ప్రథమాశ్వాసము.

క. మకరంబొక్కటి యక్కరి
గికురించుచు వాడికోఱగిఱకలఁ బదముల్
వెకలించిన, నించుక కద
లకయుండంబట్టి బట్టు లా వడరంగన్.

ఉ. పట్టిన నగ్గజేంద్రమును బాదములం బెకలించిచూచి, యి
ట్టట్టు చలింపరా కతిభయంబున మస్తకముం దటంబులం
గొట్టుచుఁ, గూఁతవెట్టుచును గుంభయుగాంతరసీమహాస్తమున్
బెట్టుచు నార్తిహారి హరిఁ బేర్కొని యుచ్చతరస్వనంబునన్

ఉ. ఓహరి మోహదయాంబునిధి యోభవబంధరుజాపహా మహా
దాహముచేత నంబువులు ద్రావఁగ నిచ్చటఁ జేరి, యీజల
గ్రాహముచేతఁ జిక్కువడి గాసిలితి న్ననుఁగావవే యాసం
దేహముగాఁగ నీవ యిట దిక్కుసుమీ ఖగరాజవాహనా !

క. అనిపల్కెడు కరిమొఱఁదా
వినియెనొ వినలేదొ యింత విస్మయముగ నం
తన దీనభక్తరక్షణ
ఘనుఁ డు మురాంతకుఁ డనంతకరుణ దలిర్పన్.

సీ. తనుబిల్చినప్పుడ వినిలోనుపడెనంచు
మకరంబు కరి రేకుమడఁచునొక్కొ
విభుఁడు గల్గిన మొఱవినఁడె లేఁడని దంతి
జడిసి ప్రాణము లేడ విడుచునొక్కొ

యార్తులరక్షింతు ననిపల్కుచుండెను
బిరుదు నేఁటికి లేక జరగునొక్కొ
యుంకించివైచిన యురువడిసేనియుఁ
జక్రంబు వక్రంబుఁ జఱచదొక్కొ
యనుచుఁ దార్క్ష్యుంను మదిమీఁటి చనఁగవాగె
నిఱికిమొత్తుచు నచ్యుతుఁ డేగుదెంచెఁ
దనదు దర్శనమును సుదర్శనము నపుడు
చక్రపదనక్రముల నొక్కసారెఁ బొదువ. 106

క. హరి గరుడుల రుచు లత్తఱి
సరిగా నొండొంట తీవ చాలుగఁ దగ నం
బరమున గన మొపుడును గం
ధరమణిఘనువులని యాత్మఁ దలఁచిరి వేల్పుల్. 107

క. కరి తలఁచుట మునుపో హరి
కరితలఁ గరమిడుట మునుపొ కాదగు నని యొం
డొరులం బలుకుచుఁ దలఁచిరి
యరుదుగ సురలలికరంజితాంజలు లగుచున్. 108

క. చక్రపదసార్వభౌముని
యాక్రందన రవమునందు నైక్యము నొందెం
జక్రికరచక్రవిదళిత
నక్రార్తరవంబు వెఱఁగునన్ సురలుండన్. 109

క. హరిహస్త స్పర్శనమునఁ
గరియును గరిభావ మెడలి గంధర్వుండై
సురమార్గంబున నాయం
బురుహాక్షుని భక్తిరతుఁ బొగడుచుఁ జనియెన్. 110

గీ. నాఁటఁగోలెను గజతీర్థనామ మొదవె
నీసరోవరమునకు మునీంద్రులార !
యిందుఁ గ్రుంకిన జనులకు నిందుధరుని
కంటె మిక్కిలి సంపద గలుగుచుండు. 111

వ. అనిన విని యక్కరివరదుని మహత్త్వంబు చిత్తంబుల హత్తి
నృత్తంబులాడుచుండ. 112

సీ. వందె మిమ్మని లక్ష్మి పంతంబుఁ ద్రోసన
నెద కౌస్తుభ మెడల్చి యదరవైచి
పడఁతి పాదములందుఁ బావలు గదియింపఁ
దొడిగియుఁ దొడుగక తొలఁగఁద్రోచి
కదిసి విష్వక్సేను కైదండ యొడిసియుఁ
గడువేగ మడరంగఁ గడకు నూఁకి
బరిమేని గరుడుని నురువడిమై నెక్కి
పదపదమని సారె పన్నె సోఁకి
సురలు గని మ్రొక్క నసురులు సురిగి స్రుక్కఁ
జక్రమున నక్రశిరమును జక్కఁజేసి
హస్తమున హస్తి మస్తంబు మస్తరించి
వెలయు శ్రీహరి శుభము గావించు మాకు. 113

క. అని పొగడుచు నాతీర్థం
బునఁ దానములాడి వెడలి మునిశేఖరు ల
వ్వనజాక్షభక్తరక్షణ
ఘనకథలు నుతించికొనుచుఁ గౌతుకమెసఁగన్. 114

మ. ఇభతీర్థంబటుదాఁటియవ్వెఁ మునుల్ హిండత్త్విషాసాంద్రచం
ద్రభటాభంగఘటీనటాంచితము లానందంబునొందింపఁగా
శుభవారిందనువుల్ దొలంచి యవలన్ సొంపొందునింద్రోపల
ప్రభలన్ వెల్గెడు బాలకృష్ణు విభవభ్రాజిష్ణు సేవించుచున్. 115

క. సీతాపతిదోర్వైభవ
కేతువు దశవదనమదనక్షేత్రైకకథా
హేతువు తాపసజనజీ
వాతువు సేతువును జూచువాంఛలు వెలయన్. 116

వ. అవ్వలనం జని రసిన విని యమ్మహర్షు లత్యంతహర్షంబునం
దరువాతివృత్తాంతంబు వివరింపు మని యడుగుటయు. 117

మ. భువనాపూర్ణపిచండచండదనుజాంభోజాతవేదండదం
డవినమ్రామృతకుండ కుండలిపక్షిట్వైభవాఖండ ఖం
డవిధూత్తంసకకాండకాండకుహరాండద్ధామమార్తాండశాం
డవిత్రోద్దండశిఖండిమండలవిభాడంబాంబుదోజ్జృంభణా! 118

క. బంహిష్ఠనిష్ఠురాశుగ
సంహతిసంహృతనిశాటఝాటమహీభృ
త్సింహా సతతోపనిషదుప
బృంహితవేదైకమూర్తి బేదవకీర్తి. 119

పంచచామరము.

ఘనాఘనాభ తారకప్రకాశ భక్తరంజనా
జనావనాభుజాగ్ర చక్రజర్జరత్పలాశనా
దినాధినాథయూథ తేజ దిక్ప్రసిద్ధశాసనా
సనాతనాసుధామృగేంద్ర చంద్రజిద్యశోఘనా. 120

గద్యము.

ఇది శ్రీరామ చంద్రసాంద్రకరుణాకటాక్షలబ్ధ సిద్ధసారస్వతవిశేషనిరర్గళవాగ్వైభవాశేషసరససాహిత్యకళాభోజ సత్యసంభాషితముఖాంభోజ సకలసామ్రాజ్యధౌరేయ నిరతావారితాన్నసత్రసంతోషిత ప్రతిదివసపంచాశత్సహస్రభూసుర బహువారావర్తిత మహాదానవైభవానర్తిత భాసుర నిజనామాంకితాకళంక వస్తుసమగ్ర బహుళాగ్రహారభూషిత చోళధరామండల నిఖిలభోగనిర్జితాఖండలసాధిత సముద్రాంతరద్వీపపరనృపాలసంస్తుత ప్రతాప నేపాళభూపాలస్థాపనాచాతుర్య కర్ణాటరాజపూజనీయ ధౌరంధర్య రామసేతుశ్రీరంగవిజయరాఘవపురకుంభకోణాది దివ్యస్థలప్రతిష్ఠాపితరామభద్ర సర్వజనసంభావితగాంభీర్య క్షుద్రావినిర్జితసముద్ర సదాశ్రితభరణదీక్షాదక్షదక్షిణసింహాసనాధ్యక్ష రాజాధిరాజసన్నుతాసాధారణ శౌర్యదిగంతప్రసిద్ధతరౌదార్య సుజ్ఞానజనకసతతసంసేవితజనక పోషితవిద్వత్కవియూథ భువనశోభితగుణసనాథ బలవత్పరిగృహీత సామంత

మహీకాంత విమోచనశ్లాఘనీయబాహాబల మూర్తి మాంబా గర్భశుక్తి ముక్తాఫల చిః చెవ్వయామాచ్యుతనృపాలపుత్ర సజ్జనస్తోత్ర పాత్ర రూపరేఖా విజిత కుసుమసాయక శ్రీరఘునాథనాయక ప్రణీతంబైన వాల్మీకిచరిత్రం బను మహా ప్రబంధంబు నందుఁ బ్రథమాశ్వాసము.

---

[illegible] -

రసు.

# వాల్మీకి చరిత్రము.

ద్వితీయాశ్వాసము.



శ్రీకాంతాకుచభద్ర
శ్రీకాంతభుజాంతరాళ శీతలకరుణా
లోకప్లావితనత యత
సీకుసుమసమానధామ శ్రీరఘురామా !

వ. అవధరింపు మప్పర్వతుం డమ్మునుల కిట్లనియె నవ్విధంబున నమ్మునీంద్రులానందంబున.

క. దక్షిణదిగ్భాగమునఁ బ్ర
దక్షిణగతి నరిగి యరిగి దర్భశయనముఁ
వీక్షించి సేతుమూలా
ధ్యక్షుఁ శ్రీరాముఁ గొలిచి తద్దయు వేడ్కన్.

సీ. చక్రతీర్థంబున స్నానంబు గావించి
బేతాళవారిధి స్నాతులగుచుఁ
బాపవినాశనీ ప్లావనం బొనరించి
సీతాసరస్సునఁ జెలఁగియాడ

మంగళతీర్థసంపర్కమానందించి
యమృతవాటికను దేహములు దోలఁచి
తీర్థఖేలనమున నలరుచు
రామతీర్థంబు పూరములఁ గ్రుంకి

శంఖచక్రజటాతీర్థ జలములందుఁ
దానములుచేసి గంధమాదనసుగంధ
మందరసుగంధవనమందమందగంధ
వాహముల దేహముల శ్రమఁ బ్రాల్చి ప్రోల.

గీ. వెండియును వారలు హనుమత్కుండమునను
బ్రహ్మకుండంబునను దీర్థరాజమైన
కోటితీర్థంబునను ధనుష్కోటియందుఁ
గ్రుంకులిడి రామలింగంబుఁ గొలిచి నిలిచి.

మహాస్రగ్ధర.

చని యానల్ గాంచినంతన్, సరభసవిసరత్సాంద్రవీచీఛటీచీ
జనితోద్గాఢాంధకారస్థగిత దళదిశాచక్రకద్యోతివిద్యో
తనకృత్స్ఫారోర్మిఝాటోత్తరళతరద్వ్యంతప్రభా......

క.

... లా

కాంచితపాఠీనఘటా
చంచల్లుఠనములు సారెసారెకుఁ గనుచున్.

ఆలంకాపాఠో మ
ధ్యాలంకారప్రకారదాకారమునం
గ్రాలు నల రామసేతువు
నాలోకించుచు మునీంద్రు లతిహర్షమునన్.

వరిసరవిద్రుమద్రుమవిభాపటలంబుల డంబు నల్గడం
బొర్విఁబొరిఁ గప్పనొప్పె రఘుపుంగవు సేతువుచూడుమో మునీ
శ్వరకులచంద్ర! యీజలధి శైవలినీతతి యిచ్చ గెంపురా
నరిపెణ మేన నీటుగన జందెపువాటుగ వైచెనో యనన్.

బిట్టురువడి నూఱేనుఁగు
లిట్టలముగఁ బోరవరుణుఁ డెప్పుడు నడుమం
గట్టించిన తెట్టన నీ
కట్ట నెలంగెడును పారికాంక్షిప్రవరా !

వారిధిరంగస్థలమున
జేరి తరంగమ్ములనెడు జెట్టులు పైపైఁ
బోరంగ నడుమ బలుపిరి
సారించిన సరణి సేతుసరణి చెలంగెన్.

ధరణీతరుణీమణికం
బరమగు నీయంబురాశి మధ్యంబున న
బ్బురపు నెరికె యన సేతువు
గర మలరెడు వివిధతరునికరదంతురమై.

క. ఆలోకించితె సేతువు
నాలోకాలోకమహీధరా కోంచలమా
పౌలస్త్యజయస్తంభము
ప్రాలి జలధిఁ దేలియాడు వగఁ గనుపట్టున్. 11

సీ. భోగికులపతిసంతతి భూమివలయ
వహనజాతపరిశ్రాంతి వదలనుదధి
పైకిఁ దేలుచుఁ దనసంధిభారమెడల
నిగిడెనో యన సేతువు దగెనరేంద్ర ! 12

ఉ. ఈవనరాశి మీఁదట శయించిన మాధవు గౌరవించి యిం
పావహిలన్ మహీమహిళ యాదటఁజాఁచినహస్తమోయనం
గా విలసిల్లెడున్ గలితకంకణనాదము లింప రాఘవ
త్క్మావరు సేతువెంతయునుగౌతుకమిచ్చుమునీంద్రచంద్రమా! 13

క. అనియిటులు వివిధగతులను
వననిధిఘనసేతుమహిమ వర్ణించుచు న
మ్మౌను లచటు గదలి బహుపు
ణ్యనదులు వనములును గాన నరయుచునుండన్. 14

మ. కనకవ్యోం బురరత్న మొక్కటి,వియద్గంగాతరంగానుమం
గన దన్మందరగంధవాహవిధుతాంగశ్రాంతి నృత్యద్వధూ
జనమంజీరఝణంఝణస్వనితచంచచ్ఛద్రశాలాఖిలా
ఘనవేందూపలసౌధయూధరుచి సంఛన్నాగ్రదిగ్భాగమై. 15

క. అదిగని మధురానగరం
బిదిగోఁ దడవులకుఁ గంటి మీకృతమాలా
నదిఁ గ్రుంకి సోమసుందరుఁ
బదరక సేవింపవలయుఁ బదపదఁ డనుచున్. 16

గీ. అరిగి వారలు హేమపుష్కరిణి చెంతఁ
గాంతతరమైన నీపవనాంతరమునఁ
దనరు కర్పూరసుందరుఁ దరుణ శీత
కిరణశేఖరుఁ గని, నమస్కృతులు సేసి. 17

గీ. పంచశరభంగ కర్పూరపాండురాంగ,
మేరుకోదండ ధృతరమామిత్రకాండ
నాగవరహారకలధౌతనగవిహార,
నీకు మ్రొక్కెద మభవ యనింద్యవిభవ ! 18

వ. అని సన్నుతించి వెండియుం జతుష్షష్టిలీలావినోది యగు
హాలాస్యనాథుని మహిమ భావించి. 19

సీ. మునులకందఁగరాని మోక్షంబు పక్షికి
దయచేసె నెవ్వాఁడు నయమెలర్ప
వివిధార్థములుగ ద్రావిడసూత్రములు సల
క్షణముగా నెవ్వాఁడు సంగ్రహించె
జంబుకంబుల దురంగంబులుగాఁ జేసి
యమ్మె నెవ్వాఁడు పాండ్యాధిపతికి

శ్రుతినిందకులఁ దామసుల శూలవిద్ధులఁ
గావించె నెవ్వాఁడు ఘనత మెఱయఁ
దట్టఁదలఁబెట్టి పట్టెఁడు పిట్టొసంగు
ముసలియవ్వకు నై మన్ను మోచె నెవ్వఁ
డట్టిలింగస్వరూపున కఖలపతికి
సోమసుందరునకు నీవు జోడుఁగలవె. 20

వ. అని వర్ణించుచు నవ్వలం జనిచని. 21

శా. అంతం గాంచిరి వారిమాడ్కి కనవద్యప్రోద్యదుద్యానముల్
వింతల్సేయుచు నుండఁ గా నుభయకావేర్యంతరీపాంతరా
క్రాంతాశాంతవిచిత్రగోపురఘనప్రాకారసౌధావళీ
ప్రాంతప్రోతమణిప్రభోజ్జ్వలనభోరంగంబు శ్రీరంగమున్. 22

క. కనుఁగొని కావేరీజల
మునఁ గ్రుంకుచు వేదశృంగమును బ్రణవమయం
బును నగు రంగవిమాన
మ్మునకు నమస్కృతులు సేసి మునికులచంద్రుల్. 23

సీ. మంచితెమ్మెరదూది నించిన గోదుమ
వన్నె పానుపుమీఁద నున్నవాని
వలచే దలాడగా నిలిపి వామకరంబుఁ
జెఱుతొడ పైఁజాఁచి మెఱయువాని
దృక్కోణఘనఘృణామృతను మీటెడులీల
నెలనవ్వుచెక్కుల దొలఁకువానిఁ

తనపాదపద్మముల్ దప్పక సేవించు
నలవిభీషణుఁ జూచి యలరువాని
సరస వాయక జయజయశబ్దములను
మించుపంచాయుధములను నించువాని
రంగతరళితమణిభూషణాంగవిభుని
రంగవిభుఁ గాంచి చిత్త ముప్పొంగుచుండ.

క. దండము లిడి నిలిచి సము
ద్దండఘనశ్యాము రంగధాముం*బాశో
ద్దండజనకు నానాజగ
దండధురంధరు నుతించి రంచితఫణితిన్.

శా. కావేరీహృదయాభిరామపులినాకల్పాహితల్పంబునన్
శ్రీకామాక్షియు నీవు లోకములు రక్షింపంగనున్నాఁడవే
యో విశ్వంభర యో కృపాజలనిధీ యో రంగ గేహాంచితా
శ్రీవత్సస్తుతవత్స వత్సలత రంజిల్లన్ మముం బ్రోవవే. 2

వ. అనిమఱియు మునిపుంగవు లాభుజంగశయనుం గని యంతరం
గంబుల భక్తియుప్పొంగుచుండ. 27

---

* పాశోద్దండుఁడు=బ్రహ్మ. బ్రహ్మకుఁ బాశముఁ జెప్పినందునకు, "కమలజు
పాశంబు గాలాపుఁద్రాడుగాఁ గాశోగ్రదండంబు గదయుఁగాఁగ."
కుమార. ఆశ్వా ౧౦-౧౫౭ వ పద్యము. మఱియు "వదనచతుష్కమి
ల్లద, రజోగుణమిల్లద పద్మపీఠమి । ల్లద, కలహంసమిల్లద, కమండలువిల్లద,
పాశరజ్జువి । ల్లద." జగన్నాథవిజయము. ఆ ౫౬౧.

చ. తలగడ బాముఁ జేర్చుకొనిదయ్యము నెయ్యమునమ్మి యేటిలో
నెలవుగ నిల్లుగట్టుకొని నీవిట్టులుండఁగ నోర్చుటెట్లు మా
వలనగు మానసాబ్జముల వాసము సేయు; కొఱంత లేను నీ
యలమట దీఱెడుఁ విను విహంగమవాహనరంగమోహనా. 28

క. అన వారి ముగ్ధభక్తికి
ననయంబును నలరి రంగహరి నవ్వుచు మీ
మనసులలోనన యున్నాఁ
డను జనుఁ డని పలుక సజ్జటాధరవరులున్. 29

సీ. పంకజబంధుబింబస్థాయి త్రైలోక్య
మంగళదాయి శ్రీరంగశాయి
సకలజనానందసంధాయి గరుడతు
రంగమయాయి శ్రీరంగశాయి
సహ్యకన్యాతటాంచలకులాయి ప్రపంచ
రక్షణోపాయి శ్రీరంగశాయి
యఖిలదైవతసంసదతిశాయి యగణిత
బ్రహ్మాండకాయి శ్రీరంగశాయి

గీ. నిఖిలజగదింద్రజాలంబు నెఱపుమాయి
యచ్చులకునెల్ల మొదలనచ్చినవ్రాయి
కొలుచువారలపాలిటి తలఁపురాయి
రావణానుజదాయి శ్రీరంగశాయి. 30

గీ. రంగనిలయోపవాసంబు రంగనాథ
చరణపంకేరుహద్వంద్వసంభజనముఁ
జంద్రపుష్కరిణీస్నానసంగతియును
గలిగె మనలకు భాగ్యంబుకతననేఁడు.

వ. అని పొగడుచు నవ్వాలం గడచియంత.

సీ. ఏవీటనిరవొందు నిందుశేఖరుఁ డెప్డు
బృహదీశ్వరుం డనుపెంపుఁ గాంచి
యేపట్టనమునకు నేలికయై నృసిం
హస్వామి జనకామితార్థభూమి
యేప్రోలికెలన నెప్డెలరారు నీలమే
ఘశ్యాముఁ డిందిరాకాముకుండు
నేనగరమున నిష్టార్థకదయఁ బ్రోచు
నతకల్పవల్లి యానందవల్లి
యెచట విలసిల్లుఁదగ సుందరేశ్వరుండు
ప్రాంతకాంత కవేరకన్యాంబుధన్య
వివిధసస్యప్రశస్యయై వెలయుచుండు
నట్టి తంజాపురంబున కరిగి వేడ్క.

ఉ. అందలి సౌధయూథములయందము నచ్చటి కేలికావనీ
బృందముచంద మాకెలన బింకపుఁజూపులకోపులించఁగా
సింహముఖుల్ నటించువగ తెల్లఁగనుంగొనిపొంగి యౌరాపో
రందరపట్టణంబె యిది రా మదిరాజిలె నంచు నెంచుచున్. 34

మ. చని రమ్యాశ్రమములు నంతఁగొంతదవ్వులఁ సాంద్రద్రుమాకీర్ణ కా
ననముల్ కొన్నిటి దాఁటి, ప్రాగ్దిశ రమానాథప్రభారమ్యహా
ర్మ్యనికాయంబులఁ జూచుఁజూచుఁ గుతుకంబౌదక్షిణద్వారకం
దనరఁ నిల్చిన మన్ననారువసుధాధారు న్నిరీక్షించు చున్. 3

క. సేవించి తదాకృతి మది
భావించి కరాబ్జయుగళిఫాలస్థలికిఁ
రావించి మిగుల సన్నుతి
గావించి ముదశ్రుపూరకలిత నయనులై. 36

సీ. పసిబిడ్డమైయుండి బండిరాకాసి కీ
లెడలఁదన్నినయాతఁ డితఁడకాఁడె
కాళియభోగరంగస్థలంబునయందు
నృత్తమాడినయాతఁ డితఁడ కాఁడె
గొల్లయిల్లాండ్ర మక్కువలెల్లఁ గొల్లాడి
యేనుగానమునాతఁ డితఁడకాఁడె
గోధనంబులకెల్ల గొడుగుగా గిరివేల
నెత్తిపట్టినయాతఁ డితఁడకాఁడె

గీ. యిచట సంపంగిమొగ్గతో యెతులసిగయుఁ
జేతబెత్తంబు మొలను బసిండిపిడియు
మును నమర రాజవేషముఁ బూనియున్న
వాఁడితనిమాయఁ దెలియంగవశమె యెందు. 37

# ద్వితీయాశ్వాసము.

గీ. అనుచు నారాజగోపాలు నభినుతించి
మించి కమలాపురంబును గాంచి యచట
భోగరాగంబులను జాలఁబొలుపుమీఱు
త్యాగరాజుల సేవించి హర్ష మెసఁగ.

చ. అనఘరతుల్ మునీంద్రులుచు నావల నావలమానశీతపా
వనపవమానముల్ శ్రమజవారిహరింపఁగ వేరజాతటీ
ఘనవివిధాగ్రహారములు కౌతుకముం బచరించుచుండఁగాఁ
గని రటఁ గుంభకోణము ధగద్ధగితేందుమణిప్రఘాణమున్. 39 40

వ. కనుంగొని యచ్చట.

సీ. చక్రపాణికి నమస్కారంబు గావించి
శార్ఙ్గపాణికిఁ గరాంజలి ఘటించి
కుంభేశ్వరునకు మ్రొక్కులు గూర్చి యలసోమ
నాథుల కభివందనములు సేసి
నాగనాథునకుఁ బ్రణామంబు సవరించి
విశ్వనాథునకును వినతిసలిపి
అవిముక్తశివునకు సాష్టాంగదండంబు
లాచరించి మఱియు నచటఁగలుగు
దేవతాతతి కెల్లను భావశుద్ధి
చెలఁగుచుండ నమోవాక మలవరించి
యభ్రసభఁ జూచుకుతుక మదభ్రలీల
నలర సమ్మౌనిపుంగవులవల దాఁటి.

క. శ్రీముష్ణముఁ గాంచి తప
శ్రీమించఁగ నిత్యపుష్కరిణిఁ గ్రుంకి దయా
భూమిన్ శ్వేతవరాహ
స్వామిన్ సేవించి యవలఁ జనిచని యంతన్. 42

ఉ. సాంజలులై పతంజలిమహాముని రంజిలిచూడఁగా దెసల్
మంజుల పాదనూపురఝుళంఝుళనధ్వని మ్రోయుచుండఁగాఁ
గెంజడ లాకసంబడరఁ గేవలతాండవమాడెఁ జిత్తభూ
భంజనుఁ డెందు వేడ్కనలభర్మసభం గని విస్మితాత్ములై. 43

గీ. ఇందుశేఖరు సేవించి యెందుమాకు
భేదమెక్కడి దంచుఁ గాన్పించులీల
నందుఘనభోగవిభవంబు లందుచుండఁ
దిల్లగోవిందరాజులఁ దేటభక్తి. 44

వ. కొలిచి మఱియు నాభద్రసభాపతి విభవంబులు పరీక్షించి. 45

సీ. నొసలికన్ బెనుమంట మసలునో సైకన
నిడుద కెంజడగుంపు గడలుకొనఁగ
నిలమోపుదుపాదము వలగొన్న నూపురం
బొండొండశబ్దంబు లుగ్గడింప
భక్తులఁ బిలిచి సంపదలిత్తు ననుభంగి
ఢమఢమధ్వనిఁ గోడి ఢక్క మొరయ
మౌళిచందురుఁడు డాకాలియంగిలిఁ దోఁచి
నిర్ద్వంద్వభావంబు నెరయఁజేయ

హత్తి శైలి మొప్పు గెంటెంబు గుత్తముగను
గదిసి రింగులువాఱంగఁ గట్టి యసుర
మట్టి నాట్యంబు సలుపు నమాధవుండు
మాకునిభవంబు లొసఁగుచు మనుచుఁగాత. 46

వ. అని సన్నుతించుచు నిలింపబాలికాకేళికాభవనాయమాన మాణిక్యఖచితచకచకితసౌధయూథప్రభాడంబరం బగుచిదంబ రంబుఁ గడచి యంత. 47

క. అరుణాచలవిభుఁ గరుణా
వరుణాలయుఁ గాంచి కాంచివరమునిఁ దేజ
స్ఫురణారుణమణినానా
భరణాంచితు నేకచూతపతిఁ గనుఁగొనుచున్. 48

చ. చనిచని కాంచి రంత హరిచందనభూరుహచారువాటికా
వని వనితాసహాయ సురవైణికతల్లజ పాణివల్లకీ
ఘననినదానుకారి మణికందరజాలముఁ బంచవర్ణ కాం
చనకలవింకచక్రవిలసద్ధ్వనిశీలము శేషశైలమున్. 49

వ. కనుంగొనియ వ్వేంకటమహీధరంబునవిశంకటమణితటంబులం దముకు ప్రమోసినగతి దుముకు నాకాశగంగాతరంగిణి నంగంబులు దోలంచి, యభంగభంగతాండవంబులం బెరయు, పాండవతీర్థంబునం దానంబులుగావించి, తటమహీరుహాకదంబక ప్రసవడంబరంబులం గదంబించు తుంబురుతీర్థంబునం గ్రుంకులిడి, మఱియు నఘాపనోదసమర్థంబు లగు ననేక

తీర్థంబు లాడుచు వచ్చి వచ్చి, మజ్జనపరమజ్జన పుష్కలా
యుష్కలావిష్కారిణియుఁ బాపిజనపాపకళంకదుష్క్రియాపం
కజకరణియునగు స్వామిపుష్కరిణిఁ దీర్థంబులాడి, 50

గీ. కువలయంబున నిదియవైకుంఠమనుచుఁ
గరముఁ జూపుచు భక్తిని గరముఁ బ్రోవ
స్వామిపుష్కరిణీ తీరభూమి నలరు
వేంకటాచలనాథు సేవించి నిలిచి. 51

సీ. మణికిరీటంబు సంపద లేమి యనవచ్చు
నమ్మ ముత్తియపునామమ్ము హసంబు
మందహాసంబుల యందంబు హైసశ్రే
సరి లేను మెడకంటసరికి నెంను
నుదరబంధము నొప్పు లోహలోహలా మెచ్చుల
మెచ్చువో బంగారు పచ్చడంబు
కటిఁ బసిండి కటారి కాంతి యెంతటివింత
మంజీరముల మంజిమంబు మేలు
ఉచితశృంగార మితనికి నొప్పఁజూడఁ
డిట్టి చక్కనితండ్రి యొందేని గలఁడె
వలతు రీ వేంకటాచలవల్లభునకు
యోగిపురుషులు మదియందయునిచి చాల. 52

వ. ఇక్కరణి నక్కంజాక్షుని చక్కఁదనంబునకు మిక్కిలి నొక్క
మఱియును. 53

## ద్వితీయాశ్వాసము.

లయగ్రాహి.

పంకజకరాకుచ విశంకటతటీరచిత
కుంకుమపటీరరుచి సంకలితవక్షో
లంకరణకౌస్తుభశశాంకరవిలోచన ప్రి
యంకరగుణప్రకర కింకరదమర్త్యా
శంకర నుతానతశివంకర సురాహిత భ
యంకర శరాగతకళంక భువనక్షే
మంకర మునీంద్రగణ సంకథితపావన ని
రంకుశమహామహిమ వేంకటగిరీశా !

క. సంకటము లెల్లఁ దొలఁగె వి
శంకట భవదీయవితతసతతఘనఘృణా
కంకటము గలుగమాకున్
వేంకటగిరినిలయ ! కాంతివిజిత కువలయా!

గీ. అనుచు నవ్వేంకటాద్రీశు నభినుతించి
మించి యవ్వలఁ జని మునుల్ గాంచిరంత
నంచితానందతీర్థసమర్థన సుమ
హాబలంబగునట్టి యహోబలంబు.

క. కాంచి మునిచంద్రు లచ్చటఁ
జెంచుల దొరయనఁ జెలంగి చెంచెతల కటా
క్షాంచలముల మరగిన నర
పంచానను భక్తవరదు భజియించి తగన్.

సీ. హరి యిక్కడను నారసింహుఁడై హిరణ్యక
    శిపుఁ జీరె ఘోరనఖశిఖరములను
బలీంద్రుఁ డిటమఖ న్నాత్మీకరింపఁగ దపం
    బొనరించి విష్ణువామనతఁ బొందె
గంగ నిర్ఝరులు దిగ్గజగండములుగ నిందు
    భవనాశినీధునీప్రభవహించె
నశ్వత్థుఁ డిచ్చటఁ గుశ్యాగ్రముభూజమై
    యమృతఫలములు దీనాళికిచ్చె

ననుచు నచ్చటి మహిమంబు నభినుతించు
కొనుచు నక్కొండఁగల తీర్థకుండలములను
దానములు చేసి మీఁది నెత్తంబు వెంట
నరిగి, యవ్వల నమ్మునుల్ హర్ష మెసఁగ.

సీ. తవణిల్లు నెచటఁ గాష్ఠజ్యోతి విద్యోతి
    తారణ్యనివహమై యహరహంబు
నొసరు నెచ్చట ద్రుమజ్యోతి ఖద్యోతిత
    కీటమై ఘనగుహాగేహములను
గ్రాలు నెచ్చటఁ వాలుకాజ్యోతి సద్యోతి
    మోహితశబరసమూహమగుచు
నుండు నెచ్చట శిలాజ్యోతి యుద్యోతిత
    శృంగంబులను రత్నభంగి నెపుడు

నలరు నెచట బరంజ్యోతి యతివిశుద్ధ
తరణి మణిశబ్దబిలదగద్ధగితభాగ
యోగసన్నద్ధ బహుసిద్ధ యోగిమతుల
నట్టి శ్రీపర్వతమునకు నరిగి రంత.

క. గంగాది తీర్థజలముల
నంగంబులఁ దోలఁచి మల్లికార్జునునకు నా
రంగగిరిమల్లికార్జున
రంగ త్కుసుమములఁ బూజ రచియించితగన్.

మ. కనిరంతన్ భ్రమరాంబికన్ హారిమణీకాదంబకాదంబినీ
జనిశోభానికురుంబ నంబరచరీచంచత్కరాంభోజ భా
జనవాలవ్యజనానిలాంకుర చలాంచత్కుంతలం గాంతలం
ఘనజంఘాలమృగేంద్రవాహన నహీంద్రై వేయ శాతోదరిన్.

క. కనుఁగొని సాంబశివ స్తవ
మున నమ్మకుటావబద్ధముగ్ధసుధాంశున్
వినుతించిన నాత్రిభువన
జనకుండును నద్భుతంబు సంఘటిలంగన్.

సీ. చుక్కల దొరయొకించుక నిక్క శిరసునఁ
బదినూఱుచెంగులపాగఁ జుట్టి
తఱచు వెన్నెలలీను దళుకునెమ్మోముపైఁ
దొలుపల్కులీనెడు తోడవు వెట్టి

ముద్దులజింక ముమ్మోన పోటుమట్టాను
సరవితో రెండుహస్తములఁ బట్టి
పెళపెళమను చెఱంగులరంగు లడరెడు
మూఁడువన్నెలపట్టు మొలను గట్టి
కేళ్లుఱుకు ముత్తియఁపుఁజాయ గిబ్బనెక్కి
చారుతరహారశృంగారహారి యగుచు
ధారుణీధరరాజనందనయుఁ దాను
నమ్మునీంద్రులమ్రోలఁ బ్రత్యక్షమయ్యె.

గీ. ఇట్లు సాక్షాత్కరించి యా ఋషులఁగాంచి
దాంతిఘనులార! మీకు వరాంతికనుతి
మెచ్చివచ్చితి నిశ్చయం బిచ్చ చెప్పు
కోర్కెలెల్లను మీకుఁ జేకూరుఁ గాక!

గీ. ఇదియకా దెప్పు డిప్పటినుండి నెవరు
నెంతమాత్రంబు నుతియింతు రింతలోన
నేను వారి కభీష్టంబు లిత్తు వేగ
మౌనివరులార యీగిరిమహిమవలన.

వ. అని పలికి భుజంగకంకణాంగ దాలింగనమధ్యంబునం బ్రవేశించె;
నంత నకాండచండనానలచాపస్వాహాపావకాశోకంబున నానం
దంబు నొందుచున్న యమ్మునిచంద్రులుం గుటజప్రసూన
వాసితంబు లగునుటజప్రఘాణంబుల నేణీడింభంబులుసంభ్ర

మంబున నక్కడక్కడ జాతి పరికొను కామధేనూధన్యథారాసారంబులు చవిఁగొని త్రుళ్ళగింతలిడ వానివెంబడిం బరువులిడు మునిబాలికల కేళికలు విలోకించి, తదంగణంబుల మునిగణంబుల పవిత్రధవిత్రంబుల హోమధూమంబుల నతిశ్యామాభిరామంబు లగు దరుస్తోమంబు లంబుదకదంబంబులని మనంబులం బ్రేమయూర నాడు మయూరార్భకంబుల లోఁగొను నశ్మగర్భరశ్మిచ్ఛటాచ్ఛురితంబులగు భూములం గనుంగొనియుం గవకపత్రస్థానంబులం గానన సీధుకానన లగు భిల్లపల్లవాధరులు భల్లంబులం ద్రెళ్ళనేసిన తమనిసువులం జూచి సంజీవకరణిం దిరుగఁ బ్రదికించి వానితోఁగూడి సంచరించు కాంచనగరుల్లక్షితంబులగు పక్షులనీక్షించియుఁ, దత్ప్రాంతంబుల నతిశాంతంబులగు శశికాంతశిలాంతరంబుల గ్రేవలం గుంభకప్రభావంబున శిలాంతరబాధులుంబోలె నిశ్చలత్వంబు నెనసిఁ భస్మితభసితోద్ధూళితాంగులగు మహాయోగుల బాగులు దర్శించియుం దత్ప్రవర్తనమహత్త్వంబు నకు నందంద డెందంబున నానందించుచు. 66

గీ. వింధ్యభూధరమును బయల్ వెడలి యచట
నఖిల లోకైకశర్మద మైనయట్టి
నర్మదను గ్రుంకి మునిశరణ్యంబు లగుచుఁ
బొదలెడు నరణ్యములుఁ బుణ్యనదులుఁగడచి. 67

సీ. ప్రతివీథిసంచరత్పార్వతీచరణాంబు
జాతనూపురఝుళంఝుళరవంబు
విశ్వనాథవిహార వృషభరాజాంచిత
కంఠఘంటా ఘణంఘణ నినదము
పటహారవ దభంగ భాగీరథీభంగ
సంఘుఘుమంఘుమ స్వనభరంబు
రక్షాధికార భైరవభుజాస్తంభగం
భీర ఢక్కాఢమంఢమారవంబు
సరవి నెవ్వేట మోక్షంబుజాటు సిరుల
కాపురంబగు నా కాశికాపురంబుఁ
దఱిసి మణికర్ణికాదితీర్థముల నాడి,
యభవుసేవించి యచ్చట నలరుచుండె.

క. ఆ కాశీశ్వరు తార్తి
నైక విలోచనమునందు నెసఁగెడు సెగలే
పైకొనియె ననఁగ లోకం
బాకులపడఁ దోఁచె గ్రీష్మ మతిభీష్మంబై.

క. పటపటఁబగిలెం గుంభిని
తటతటఁబధికులమనంబు తల్లడపడియెన్
చిటచిటనెగసెన్ దవశిఖ
కటకట గ్రీష్మం బొకింత కనఁబడునంతన్.

చ. బడి చనుదెంచుచాయ ధరఁ బాంథులతాపముతీర నక్కడ
క్కడఁ దరుజాలమూలములఁ గ్రమ్ముచునిల్వఁగదాని గ్రుచ్చుకో
వడిఁ గరపాళి యొత్తి దినవల్లభుఁ డల్లన సాఁగె నాఁగ న
య్యెడనతిదీర్ఘభావమువహించెనహంబులహోమహోగతిన్. 71

గీ. అట్టివేసవి బెడిదంపు వెట్టకతన
నేల నందంద విరిసిన నెఱియలందుఁ
దరణిపాదంబు లెడనెడఁ దవుల మెల్లఁ
దివిచికొనిపోవ దివసంబు దీర్ఘమయ్యె. 72

చ ఘనతరకీచకోత్కరముఖంబులఁ దద్గతభోగిఫూత్కృతుల్
దనరఁగ నూఁదియోషధికదంబకచూర్ణముఁగూర్చి కొండలం
*గనకము సేసెఁ దత్సమయకైతవసిద్ధుఁడనంగ నెల్లెడం
గనగన మించె నెంతయు నఖండదవాగ్నిశిఖాప్రకాండముల్. 73

చ. ఖరకిరణోగ్రతాపమునఁ గ్రాఁగి రసాతలభూమి డాఁగి సా
గరములు నింకెనో యనుచుఁగ్రైకొనిచూడఁగవచ్చిపోవుచుం
దిరుగు సవిస్మ్యదంబుదతతిం దలపింపఁగఁ జేసె నయ్యెడన్
ధరణిధరాగ్ర జాగ్ర దురుదావ ముఖోద్ధత కీలిధూమముల్. 74

* ఈధూమవేధిశబ్దవేధులకు:—

ధూమవేధీరసం పిష్ట్వా తేన వస్త్రం ప్రలేపయేత్ తతో జ్యోతిష్మతీ తైలే తప్త్వావర్తిం ప్రకల్పయేత్ । జ్వలితాం తాం తామ్రశైలే యోజయేత్స ప్రతాంగతే । తద్ధూమగంధమాత్రేణ సర్వంభవతి కాంచనం । శబ్దవేధీ రసోయోఽసౌ గులికాంతేన కారయేత్ । తత్సర్వంజాయతే స్వర్ణం శ్రుతే శబ్దే నసంశయః । పాషాణవేధకోయోఽసౌ పర్వతానపితేనవై, వేదయేదగ్నితప్తాని సర్వంభవతి కాంచనం. అని మంథానభైరవుఁడు:—

ఉ. అబ్బలు వేసవిన్ ఘనగుహాంతరసీమల రేవగళ్లు మైఁ
బ్రబ్బెడు నుబ్బ సుబ్బఱఁగఁ బాటలు దప్పి మొగంబు లెండఁగ
బెబ్బులు లొక్కపెట్ట నతిభీకరభాంకృతు లాచరించె నా
గుబ్బగ గొండలెండవడఁ గ్రుంకుచుఁ గూఁతలు నెట్టనో యనన్

క. సుడిగాలి ధూళిఁ జిట్టుచు
వడిగా నందంద తిరిగి వలయంబగుచున్
బుడమియును బరణి తెఱవిడిఁ
గెడుకరణిం జాలె నట్టి గ్రీష్మమునందున్.

గీ. ఊష్మలత మించ నెంతయుఁ గ్రీష్మపాలి
చండమార్తాండకిరణంపు జాటి మీఱ
నెండమావులు గదలె నత్యంత గతుల
మృగకులంబులు గని తృష్ణఁ దగులుకొనఁగ. 7

క. బడిఁ బఱచు నెండమావుల
నడుమ నపుడు గాలిలోఁ గణంబుల నత్య
ద్భుతబాగ్నికీలముల గతి
గనుపించెన్ ధాతుపుష్పికానివహంబుల్. 7

గీ. పడగ సురటుల నప్పటప్పటికిఁ గొంత
ఘూత్కృతులవేరి గాడ్పులు పోనుచుండ
బ్రదుకుఁ గనెఁ గాక భోగు లప్పగిదిఁ గాక
యుండెనే నట్టి వెట్టచే నుడికిపడవె? 7

# ద్వితీయాశ్వాసము.

క. ఆతటి సలిలం బెందును
బాతాళము ద్రవ్వగానఁబడకుండు గతిఁ
భీతిల్లు యోగిజనులకు
శీతలకుంభకము గలుగ జీవన మొదవెన్.

సీ. కమ్మవీడెంపు లేఁగారంబు గలమోవి
కండచక్కెరపానకంబు లిచ్చి
చలువతావులు గుల్కు కలికిలేఁబల్కుఁగ
ప్రంపుఁ బల్కులను గర్ణములఁ జొనిపి
జీనిపన్నీరు నించిన యట్టి కుచకుంభ
యుగళంబు నక్కున నొత్తియొత్తి
పాటలసుమసౌరభంబులు వెదజల్లు
సొగసుఁబయ్యెదకొంగు సురటివిసరి
రమణు లెంతయుఁ దమతమ రమణులకును
దాపములుపాపి రోకకొంత తపనుఁడపుడు
తనదుపంద్రెండుమూర్తుల నెలసినట్లు
కొండ లవియంగ గందంపు కొండగాయ.

క. ఇటు లన్వేసవి యెల్లెడఁ
జొటచొట నిప్పుకలు కలుగుచో నక్కాశీ
పుటభేదనంబు వెలువడి
యటుచనుచు మునీంద్రు లవల నవలద్గతులన్.

మ. తమసానిమ్నగ దాఁటి తజ్జల సముద్యద్వాలశైవాల జా
త మసారద్యుతి తీరభూరుహవిఘాఘట్టంబు తోఁగూడి సం
తమసానీకముఁ బోలె నల్దెసలు నిండం జూచి యోహో మహా
తమసానీరము నిండెఁ జెల్లదని చింతం జాల బల్కింపుచున్.

సీ. పలువంకలకు డిగ్గి పలువంకలకుఁ జాఁజు
కొండవంకలు కెలంకులను నింప
నొండొంటఁ దీర్డించు నుంబ్రలఁ జంబ్రల
బాదిగొప్ప పేకతపాదలఁ గూడలఁ
జదలంటఁ బెరిగినఁ జాలుఁగోయులఠావు
జాళై యల్లిన లీల సందు నెసల
నాఁగినకో... ... ...
వలయంబుఁగొనలోనఁగలయుబలసి
వెదురు ములుబూర్గు ములు రేఁగు వెలగ వేము
గలివెయుఁ జెలంగ దిగ్గజకర్ణములను
జెవుడుకొన ఝల్లికాధ్వని జిండ్రమనఁగ
జీమదూఱని యొక వనసీమఁ గాంచి. 84

ఆ. మాను లచట వారిమార్గంబు గానక
వెదకివెదకి యల్ల విపినభూమి
పాపటయును బోలెఁ జూపట్టు నొకతప్పు
ద్రోవ వెంటనంటి బోవు చపల. 85

# ద్వితీయాశ్వాసము.

## స్రగ్ధర.

కనిరామాసీంద్రచంద్రుల్ ఘనరసవదసృక్స్వారణాచుంచుపంచా
నన కోపాటోప చంచన్నఖరకులిశ భిన్నత్రుటత్కుంభిరాట్కుం
భనివేశోన్ముక్త ముక్తాఫల సరవిసరోద్భాసి భిల్లీమతల్లీ
ధనురాస్ఫాలస్ఫురన్నిధ్వనిజనితమృగీభావనంబున్ వనంబుఙ్.

క. కనుఁగొని యోహోహో! యీ
వనమహిమము లేరికైన వర్ణింపంగా
జనునే, యటంచుఁ బలుకుచుఁ
మునులందఱు నవ్వనాంతముననంతంతన్.

సీ. తోరణంబులుగ వీథుల నారఁగట్టిన
యుప్పగండలకు నొండొండ దిసుగు
పులుగుల తెక్కఁగాప్పులఁ జాల నెగసెడు
పసరంపుఁ బొలకంపు ముసురుకొనఁగ
బసివట్టె నలుగడఁ బఱచిన మెకముల
పచ్చితోళ్ళను బండ్లఁ గ్రుచ్చిపెఱుకు
బలుజాగిలంబుల భౌభౌ రవంబులఁ
గొంకి పంకములోన ఘుర్ఘురించి
పరువులిడు సూరపందుల ముఱికిగవులు
చేఁప తట్టలఁ గదురుతోఁ జెనసిచుట్టఁ
గూఁత వెట్టిన జనుల వాకొలుపఁజేయ
భయముగొల్పెడు నొకబోయపల్లె గాంచి.

క. చుట్టును బసరపు టెముకల
తెట్టలుచూచినను మదికి దిగులయ్యెను హా
కట్టేఁడిదైవం బిచ్చటి
కెట్టు మనలఁ దెచ్చె దాఁటు టెట్లొకొ యనుచున్.

క. చండాలవాటికయు నిటు
లుండుననె యీరోఁత గన్న నొక్కటఁ బ్రేవుల్
గుండెలు నిలువక వాంతికి
నొండరిగెడు కర్మఫల మహో యిటు లుండెన్.

క. నెఱి చెదర కిరాతుల ముం
దఱనైనం బోవవచ్చు దయమాలిన యి
క్కఱకుఁగిరాతుల ముందఱ
వెఱవక చనఁ బోల దిచట వెఱ వెయ్యదియో.

గీ. అనుచుఁ గిరములు మొగముల కడ్డమిడుచుఁ
గోసినటువలె మనసున రోసిరోసి
వ్రాసి యుమియుచు నుడియు దుర్గంధమునకు
నాసికలుమూసికొనుచు సన్న్యాసివరులు. 72

చ. మిడిమిడియెండ కొట్టునను మేనులు పెట్లుచునుండ నేలపై
నడుగుల దమ్ము కుమ్మువలె నంటుకొనంగ వడిఘర్మతోయముల్
జడిగొనఁ గా జటల్ గడవసంబులు మోవఁగ లేకపోవ న
య్యెడనొకబోయదాయవలెనెక్కడనుండియొయద్భుతంబుగన్. 93

క. బడి నేఁగుదెంచి *యుఱుమని
పిడుగుంబలె నిప్పు లురులు బెడిదపుఁజూపుల్
గడలకు జడిగొనఁ గడువడిఁ
బొడమెడు తర్జనల నడవిపులుగులు బెగడన్.

చ. కటికటియించు నీలుబలుకాసెయు నల్లని మేనుఁ జిమ్మఁజీ
కటి ఘటియింపఁ జేత విలుఁ గైకొని *మేఘపుఁబిల్లవోలె న
ట్టిటు శరపంజులడ్డముగ నేయుచు డాయుచు వచ్చివచ్చి యా
జ్జటికులసార్వభౌములను సాఁగఁగ నీ కరికట్టి నిల్చుచున్.

క. నిలునిలువుఁడు మీ చేతం
గలసొమ్ముల నెల్ల నిచ్చి కదలుఁడు నాతోఁ
జలపట్టిన మిము నందఱఁ
* బలుచట్టులమీఁదనుతికి పారన్వైతున్.

గీ. అనిన నవ్వానులడిఁకిన నటు కిరాతు
బులుకుపులుకునఁ గనుఁగొని పలుకకున్న
బెడుసుఁజూపిన గాని యేయుడుగ గుడుసు,
* బాఁపనపిసాచులకు భీతిదోఁపదనుచు.

సీ. తోలుదొల్తఁ గుప్పె గోలలు గొన్ని పై నేసి
యవినెట్టుపడిపోవ నాడు గఱచి
గన్నె రాకుములుకుల్ గొన్ని నూటిగఁ బన్ని
యవిపెకిఁ దేల నహంకరించి

యీ శేకుచిలుకుల గోరులంటఁగఁ జెంది
యవియు వచ్చెనవో నదరిపదరి
పారావతమ్ములు పవిత్రమైను నిగిడించి
యదియును దప్పిపో నాగ్రహించి

యిన్ని నాళ్ళకు నాచేత యేటుదప్పె
నౌర ! యీజనదారుల కంపతప్పు
గలదు గాఁబోలు ననుచును గరకు చూపుఁ
జూపు లదరంగ నటువాని చుట్టువారి.

సీ. జడలచుట్టు కుదిచ్చి మొసలపై మోచేత
గుప్పుగుప్పున సాకె గుబుకిగుబికి ×
కత్తిపాలలుచించి రత్తకేలను మూంచి
జడియంగ మొగములఁ జల్లిజల్లి
సలిలంబు గళగళ తలలమీఁదటఁ బోసి
బుట్టకాయల నెనిపొడిచిపొడిచి
కడవసంబుల రెమ్మ పెనమల్లగాఁ ...
కూనుపోనడిచిపుఁ గొట్టికొట్టి
యిట్లుబాధించి శోధించి మోహ నొక్క-
× పచ్చపై కంబుగాన కప్పచ్చిపోను
నేఁటి తెరవాటు పసలేక దాటిపోమె
ననుచు వెసవారి పిసమూని యవలికేఁగి.

# ద్వితీయాశ్వాసము.

గీ. వింటికొప్పునఁ జేయూది విన్నఁబోయి
యుసురుసురటంచుఁ గలఁగుచునున్న వాని
చంద మీక్షించి యప్పు డాశాంతమతులు
మునులు పలికిరి చేసాఁచి మనికితమున.

గీ. తాపసుల మమ్ముఁ బసులచందమునఁ గొట్టఁ
జేతు లెట్లాడె నిదియేమి చేటునీకుఁ
బాతకుఁడుఁగాఁగ నెన్నాళ్లు బ్రతికె దీవు
రాతఁ జేసెరె యోరి! కిరాత నిన్ను.

క. ఇటమునుపు నీవుచేసిన
పటుసాహసములకు నెల్ల ఫలమగు నో యీ!
జటివరుల నిటులఁ గొట్టితి
కటకట! యిఁకనైన దురితగతి మానవుగా.

క. ప్రాయము జలకల్లోల
ప్రాయము కాయంబు నస్థిరం బిందులకై
రోయక దురితమెతపమని
పాయక చేసెదవు నిందపరఁగఁ బుళిందా.

వ. అనిన నాలుబ్ధకుం డతిశుద్ధస్వభావుల సల్లాపయోగంబున
నుల్లంబునం గొంత శాంతి పల్లవింప వారల కిట్లనియె. 104.

గీ కోలదపసులార యాలిబిడ్డలకుఁగా
గాఁకనావటించ గాన విడిసి

విల్లు సంకకోల లెల్లను గైకొని
యున్న నాకుఁ బాప మొదవు నెట్లు ? 105

వ. అనిన సప్తఋషులు తెల్లిన వీని ననుగ్రహింపవలయు నని
మఱియు నిట్లనిరి. 106

క. ఓకోరి నీవు చేసిన
ఘోరపుఁ బాపములు నీవుఁ గొడుకులు నాలుం
జేరఁ బడి పంచుకొందురొ
వారికిఁ బని లేక నీక వచ్చునొ చెపుమా. 107

క. అన విని వాఁడు ముఖాలో
కనముచ స్థానంబు పోఁకముఁగా శబరుం డో
మునులారా! యుత్తరం గా
లిని బిడ్డల నొప్పుడు తెలిసి యేమయ్యెదన్. 108

క. అదె కల్లె దప్ప్వ లేదిటు
కదలకుఁ దేవచ్చుదనకఁ గాదని యువలం
గదలిన నాలాగు నెఱుం
గుదు రే కదయుంచుఁ బలికి గొబ్బున జనియెన్. 109

మ. చనిమార్గంబున జేణవర్గముల నేచం బోక లక్షించి ప
క్షినికాయంబులఁ గొట్టఁ గోరక మదిం జింతాభరం బెంతయుం
ఘనమై యెక్కఁగఁ బక్కణంబునకు వేగంబోయి యేచక్కిఁ జ
క్కని తాటింటికి జేఁగి వేకమగు కాంతన్ వెచ్చగా నూర్చుచున్.

క. విలునమ్ములు నటువైచుచు
నలసత నొక జింకతోలునందునఁ గూర్చుం
డిల వ్రాయుచుఁ దనపాపముఁ
దలపోయుచు నెమ్మనమునఁ దల్లడపడుచున్. ॥

చ. కుడురుగ జంగసాఁచి చనుగుబ్బలు మీటుగఁబొలుటాకుఁ బ
య్యెద పొదలంగ నెన్నుదు రొకింత చెమర్పఁగ మేచకాళి నే
ర్పుదొరలఁ బాడిచందనపుఁ దోలునఁ నేనుఁగుఁగొమ్ము రోఁకటన్
బ్రిదిలెడుకొప్పుతో వెనరుబియ్యము గొప్పనిజప్రియాంగనన్.

క. రావే యనిపిలిచిన నది
వేవేగన్ వదలు కొప్పు విప్పను జన్నుం
గ్రేవల వలఁగొను కెంపుం
దావడముల యొప్పుఁ జొప్పడవఁ జనుదెంచెన్.

వ. ఇట్లు చనుదెంచిన యయ్యంగనం గనుంగొని యక్కిరాతుండు

క. ఓపడఁతి ! తానొనర్చిన
పాపంబులు దలఁప నీకుఁ బనిగలదో నా
కేపనియొ కాక చెటిసగ
మైపరఁగునొ నాకుఁ దాఁచ కంతయుఁ జెపుమా.

క. అనవిని యచ్చెలి నగుచు
న్ననుఁ నాయక! తలఁప నాకు నీదగు పాపం
బునకుఁ బనిలేదు నీప్రో
పున నెంతయుఁ గుడిచి కట్టి పొసఁగుట కన్నన్. ॥

చ. తపులక్ష వారికెవ్వరికతంబున నీవెర వప్పుడీసి తె
త్తువొ కొని తెత్తువో చెరుపుదోఁచుచుఁ బెత్తువొ ఋణమొనర్చి తె
త్తువొ చని తెత్తువో యదియు దోసమొ పుణ్యమొ నాకు నేఁటికా
తవతవ నీవు దెచ్చినవి దాఁచక పంచఁగఁ బాడి నిచ్చలున్. 117

క. అనవిని మనస్సు చివుక్కన
మనఁ గొడుకులఁ బిలిచి యట్ల యడిగిన వారుం
జనని పలికినటు పల్కిన
విని యచ్చెరు వంది చాల వెఱ వెఱ నగుచున్. 118

గీ. మోసపోయితి నిన్నాళ్ళు నాసఁ దగిలి
యాలుబిడ్డలఁ దానఁ జుట్టా లనంగ
నెవ్వ రెవ్వార లే యూరి కేదిక్కొ నా
వీరి కేఁ బాటుపడు టెల్ల వృధయయ్యెఁ జుమ్ము. 119

క. దోసమునకుఁ బని లేదట
నాసొమ్ములు వీరికిం దినంబని గలదే?
రోసితి సంసారముఁ దెగఁ
గోసితి మొదలంట బంధుగుల తగులెల్లన్. 120

వ. అని తలంచి యన్నిషాదుండు సన్యస్తసమస్తసంసారుండ
గుచు నానాసుకృతవాసనావిలసితంబగు సమాజ్ఞానామృతా
స్వాదనంబున మోదంబు నొందుచుఁ బుత్రమిత్రకళత్రాది
సంగమంబు తొఱంగి, కొమ్మల సమ్మునుల పాలికిం జని యం
దంద వందనంబులు గావించి యంజలిపుటఘటితనిటలతటుం

డగుచుఁ దచ్చరణరేణుసంస్పర్శనంబునం బాటిల్లు వాక్పాట
వంబున నోముసీందుర్రిలారా ! సకలకలికర్శనంబగు మీాసం
దర్శనంబునం గృతార్థుండనైతి; నాజననంబు సఫలంబయ్యె;
నాజవంజవభంజన స్వతంత్రంబగు నొక్కమంత్రంబు నాకు
పదేశింపుఁడనుచు సంతసంబునం బునఃపునఃప్రణామంబులా
చరించిన, నవ్వాచంయములు న్వనేచరుని సమీాచీనధీచాతు
ర్యంబునకు నాశ్చర్యంబు నొందుచు మున్ను వీడెన్నితపం
బులు సలిపెనో యాటవికుండయ్యు సత్కర్మంబు వాటింపం
దలంచె నెంతటి ధన్యుఁడని సంతసించి, సర్వవర్ణసాధారణం
బును నిఖిలమంత్రఫలదంబును లోకాపారదోషరహితంబును
దేశకాలనియమానుపేతంబును సత్యకామంబును శుభ్రత్యభి
రామంబును మనుసార్వభౌమంబును నగు రామనామంబు
కాని వీనిం బవిత్రుం జేయు వేఱొక యుపాయంబు లేదనియా
నేతాదృశులకుఁ బ్రతిలోమంబుగా నుపదేశింపవలయు నని
విచారించి యాదండ నొక్కతీర్థకుండంబున నక్కిరాతు
సుస్నాతుఁ గావించి సంభావించి. 121

శం. కిరాత రాఁ దలంపు హత్తి కేవలంబు భక్తిమై
మరామరా యటంచుఁ బల్కు మా యనుగ్రహంబునన్
బరాకు రాదటంచు రామమంత్రమిచ్చి యంతటన్
ధరాధరాధిభూవిభూతి దర్శనాభిలాషులై. 122

క. చని రవ్వాల నమ్మునులను
వనచరుఁడును వారి బుద్ధివడలక మునిలో
ననుదినము కందమూలా
శన మొనరించుచును నితర్గసంగరహితుఁడై.

సీ. నుదుటఁ జేగురుబొట్టు పదనింకఁ గాదని
తులసిమృత్తిక నూర్ధ్వతిలకమిడికొని
సెలసువిల్లువహించు కేలుసాబుగాదని
వేణుకుండిక యొంపుపాణిఁబూని
సొగసునున్న నికోర సిగసూటిగాదని
నిడుదపెన్నెరులెల్ల జడలుదాల్చి
*నిండుగాటపుసిలి దిండుగాదని కటిఁ
బలుచనినారచీరలు ఆశ్రయించె
దినము తమసాతరంగిణీ తీర్థమునను
స్నానమొనరించి యత్యంత శాంతిమెఱయ
మౌను లుపదేశమిచ్చిన మంత్రమెప్పుడుఁ
దపముసేయుచు నక్కిరాతప్రభుండు.

క. ఈసరణి వాఁడు సకల
వ్యాసంగము మాని మౌనివర్తన నుండన్
వేసటచే వీఁ డెక్కుడుఁ
గాసింబడె ననుచు వానికలవారెల్లన్. 125

* నీలిదిండు "పాయిదలనీలిదిండ్లొలికి బూడిదయుండలబంతి" దశ
౫-౫ (తాళపత్రప్రతి.)

## ద్వితీయాశ్వాసము.

క. చెట్టుల పట్టుల గట్టుల
చుట్టుల నందంద వెదకి సొలయుచు నొకచో
నట్టడవిలోనఁ గదలక
చెట్టుంబలె నున్నవాని చందముఁగనుచున్.

క. నట్టడవిఁ జట్టుకొడుకై
కట్టెమటన్ మనము నిలువఁ గా జూడఁడు తా
నిట్టెటు బాఁపనదయ్యము
వట్టెనొ యీరావినుండి బాపురె! వీనిన్

క. ఇయ్యఁడవి వీని నేబలు
దయ్యంబులు వేసెనొక్కొ? తరలకయుండన్
డయ్యుఁ డొకింతయు మనతోఁ
గుయ్యనఁనొల్లండు కన్నుఁగొన తెఱవంగన్.

సీ. నెమ్మిపింఛెపుదండ గ్రిమ్మ చుట్టెడుకొప్పు
జడలుదాల్చుట కిట్లు గడలుకొనెనె?
పచ్చికస్తురిబొట్టు పసమీఱు నెన్నొసల్
సుద్దరేకలచుక్క దిద్దఁబడెనె?
తడవిల్లొకప్పుడు విడువనిచేతుల
మోముచూపెడునట్టి నుట్ట[illegible]నెనె?
యడవిలోఁగడువడి యుడుఁగని యడుగులు
గదలక యీచాయఁ గుదురుకొనెనె?

యకట చెడి నీని నెవ్వఁడో యంకకాఁడు
తప్పసుద్దుల బుద్ధులు తగులుకొలిపి
బోయజాతికి వెలిగాఁగఁ బాముఁజేసి
నాలుబిడ్డలు మనుమలు నలియఁజేసె. 129

వ. అనివానిం జేరుకొని యందఱు మఱియు నిట్లనిరి. 130

ఉ. దాయలుగూడి యెవ్వరు విశా నిమమాతలఁగాకయుండ ని
మ్మాయలు పన్ని యింతవలమా తలమానిసి వింటవింట నీ
వేయఁగ నేర్చునో నలల నేమొకలా దిగు గాడ సేనకో
బోయతనంబు నిట్టిడిన యేమొఁగదా మునివాసి వమ్మగన. 131

క. సాము దిగవిడిచి నినుఁబలి
సాముగ నట్టిది నినున సవిమాని యమో
జాము దిగఁగాళ్ళ నిసిసుని
జాములు నిలుఁలుండ సుఖగ జాతికిఁ దగునే. 132

సీ. కన్నులు దెఱవని గండభేరుండాపు
నిసువుల నెవ్వను నీస్తూనను
నేనుంగుతల పాలనెవ్వరు పెట్టురు
పెంచినసంగంపు పిల్లలకును
కవిసినదొడ్డిలోఁ గాడెను పెంటుల
దట్టించి యెవ్వరు గట్టఁగలరు
పులులకూనలకు చేపురు మాపుఁ దగునట్టి
మేపులెవ్వరు దెచ్చి మేపువారు

ఇంటనీవటు లేకున్న నిట్టిపనులు
కుఱుచబుద్ధితలఁచేనా నె? కొలమువారు
చాల నెగ్గింప నామముచాతినుమట 133
నుదుటుతనమెల్ల మాని యిట్లుండఁదగునె.

ఉ. కానకు నేఁగి వింతరుచిగల్గిన పిట్టలుఁ జెట్టు జున్నులున్
దేనెలు చారపప్పులును దెచ్చుఁగదా యిఁకనంచు గూళ్ళలో
గూనలు వోసి నీకొడుకుఁ గుఱ్ఱలు నీచనుదెంచుత్రోవఁ జూ
పానఁగ నిల్తురయ్యెడలు హా! మనుఁబోంట్లకుఁజూడవచ్చునే. 134

క. గువ్వకఱకుట్లు మెకముల
క్రొవ్వుల బొరుగులును గునుకుగుము లేయుటయు
న్నివ్వరికూడును నింటం
బువ్వంబునఁ [illegible] కిల్లు పొక్కుందగునే. 135

ఉ. బో[illegible]ప్పితలు పున్నమవెన్నెల బైట నీపయిం
బాయనిబాతి కిన్నరలు మాటికి మీటుచు నీప్రతాపమున్
హాయని చొక్కిపాడ వినవా కనవా మనవారిఁబాసి నీ
వీవెడ నొంటినుండఁ దగవే తగవే చనుదెమ్ము వీటికిన్. 136

సీ. కులుకుగుబ్బలతోనె కురువిందపేరులు
గునియుచుఁ బెనఁగొని గొడ్లిఁజూప
దంతంపుఁగమ్మల తళుకులుపలచని
చెక్కుటద్దంబులఁ జికలిసేయఁ

బగడలరతనాలు బవిరులు పికిలి పూ
దండకొండొంపఁ గై దండెమొసఁగఁ
గదలుఁగొప్పునఁజుట్టుఁ జెదరిపారెడు మల్లె
మొగ్గలు తెలినిగ్గు గ్రుమ్మరించఁగ
నడవిదడవిల్లుఁ గైకొనియమ్ముఁ దొడిగి
పొంచి పైవంచి నినుదెచ్చరించి మించి
మెకముఁబడనేసి నిచ్చలు మెచ్చఁజేయు
నట్టి నాయకురాలిఁ బాయంగఁదగునె. 13

సీ. దుప్పులఁబడనేసి యుప్పుఁగండలు చేసి
చప్పరింపుచునుండుఁ జవులుమఱచి
మదహస్తినదలించి యదిహస్తి రాఁబొంచి
యెదనాటుకొననేయు నేటుఁదఱచి
పచ్చికస్తురిమేన హెచ్చువాసనలీన
రంగులేయుచునుండు రహిదొఱంచి
మింటిమ్రాకులనంటియుంటి మ్రాకులుప్రాకి
జుంటితేనెలుగ్రోలు సొంపుమాని
నారచీరలుగట్టి యన్నంబుదట్టి
గాలిమెసవుచు నాతిపై బాళిలేక
జపము ప్రేల్చును నెన్నుచు జాతివిడిచి
బాపలమగూడియుండుట బాతియగునె ? 13

గీ. తెల్లవారిన గుండగ్గి కోళ్ల లీల
నీళ్ళమునుఁగుచు నొడలెల్లఁ దెల్లఁబాఱి
నిట్టుపాసంబులనుగూడి నెవ్వఁదొడరు
వెడగుబాపన తగులునఁబడితివేల ? 139

క. పతిచెడ్డ బిదబాపని
గతి నిట్లుండంగఁదగునె ? కటకట మది ! నీ
వెతనెంచవు మనకులమగు
మతమెంచ వొకింతరాతమలిచిరో ? నిన్నున్. 140

వ. అని యివ్విధంబున నావ్యాధులెల్ల మహావ్యాధులుంబోలెఁ బాధింపఁ జయ్యన సాధారణాగాధ బోధైకనిధానుండగు శబరనాథుండును. 141

క. కనుఁదెఱచి నవ్వి యేమియుఁ
బనిలేదని ముందుమీరు పలికితి రిపుడే
పని కిటువచ్చితి రిందఱుఁ
జనుఁడెఱుఁగుదు మీదుమాయ జరగునె ? యింకన్. 142

గీ. తండ్రి రాముఁడు జనకజ తల్లియెల్ల
బంధులును నాకు నాస్వామిభక్తులెన్న
నింతవాఁడను నాకిందు నెదురుగలదె ?
సకలజగములు నేలుదు సుకరముగను. 14

క. మీరెవ్వరు ? మేమెవ్వరు ?
నేరము లెంచక చనుండు నిలువక యెటకే
శ్రీరఘుపతియే నాకు స
కారణ బంధుండు గురుఁడు గణుతింపంగన్. 144

క. కటకట ! జననంబులు వే
రఁట గుణకర్మాదికంబు లక్షణంబులు వే
రఁట చనియెడుత్రోవలు వే
రఁట యిది యెటుమతిపుఁగూడు మఱికనవలదా. 145

క. సతులెవ్వరు సుతులెవ్వరు
హితులెవ్వా రేటివలఁద నెందేకాని
జతగూడిన కార్యంబుల
గతి నెంచుక కూడివిచ్చి కదలుగఁ దవలున్. 146

క. అనియూశ వినఁగ నాఁడిన
విని యండఁటుఁ జనిరి తాత నేసిగతి స
వ్వనచరుఁడు నంత నంత
ర్ఘనతరబోధావధాన గంభీరుఁడున్. 147

సీ. సరసిజాకరముల సరసిపద్మాతుముల్
పరిపక్వముగ నేరుపఱిచి తెచ్చి
పురుషభోగ్యములైన పూసలువాటించి
ముఖములుముఖముల మొనయఁజేసి

పరభాగములతో నపరభాగములనుంచి
ఁ షుమ మేరువుఁగ రెండిటి యమర్చి
యంతరంబున గ్రంథు లమరసూత్రంబున
నూటయెన్మిదియుఁ బొందుపడఁ గ్రుచ్చి
యట్టి యక్షసరంబుఁ జేబట్టి తనకు
మాఁకులిచ్చిన యదిగాక మానసమున
దలఁచి యంగుష్ఠికాద్యంగుళులనుఁ మేరు
పదము దాఁటక త్రిప్పి జపంబుఁ జేసె.

సీ. దినము మరామరా యని పల్కనంతంత
యది రామనామ పర్యాయమయ్యె
నారామ నామ జపానుభావంబున
నంతర్ముఖతఁ జూడ నల్లనల్ల
నల్లని మొగులొండు నానాఁటఁ గనుపించె
నదియుఁ గోదండకాండాంకితమగు
సగుణభావముఁ జెందె సగుణరూపంబెల్ల
రూపింపనిర్గుణ రూపమగుచుఁ
గోటిరవిచంద్ర తేజమై కొమరుమిగిలి
నట్టి తేజంబునందును నంతరంగ
మిట్టటుచలింప నీయక గట్టిగాఁగఁ
బూఁదెగఱగినగతి నేకముగ ఘటించె.

క. అ తేజంబున నెంతయుఁ
జిత్తములయ నంతఁ గామక్రోధమోహములుం గా
హృత్తామసమును నూనము
నుత్తమయోగుల నటించెడుం గవలుం ద్రె. 150

వ. అని చెప్పిన విని యమ్మునిపుంగవులు నతని నాత్మవృత్తాంతం
బడుగుటయును. 151

శా. ఉద్దండానలదంతకోపన సుబాహూగ్రప్రచండోగ్రసంభూ
భృద్ధంభోళిశిలీముఖప్రకటిత మారీచజ్వాలన్నామ వి
న్యస్తామహ్యగ్రనామగ [illegible] గర్వోన్నతా
యుద్దామద్యుమణిప్రసిద్ధ [illegible] ప్రా [illegible] నయా.

క. సుగ్రీవ భరణగుణ సా
మగ్రీ మాందంశతాంశ మాలితకీర్తీ!
విగ్రహీకృతశూర్పణఖా
వ్యగ్రీభవ దమరవైరి [illegible]! 153

మాలిని.

చిరమునీశ హృదయ సుదేశ చిత్ప్రకాశరూప వి
స్ఫురణగణ్య జనశరణ్య భువనపుణ్యశోభనా
కరవిహార యమృతహార కలితసారకీర్తి సం
భరణలోల దిగధిపాల భణితశీల ఫాలనా! 15

—గద్య.—

ఇది శ్రీరామచంద్రసాంద్ర కరుణాకటాక్షలబ్ధ సిద్ధసార స్వతవిశేష, నిరర్గళ వాగ్వైభవాశేష సరససాహిత్యకళాభోజ, సత్యసంభూషిత ముఖాంభోజ, సకలసామ్రాజ్యధౌరేయ, నిత్య వితీర్ణిధారారాధేయ, నిరతావారితాన్నసత్త్ర సంతోషితప్రతిదివస పంచాశత్సహస్రభూసుర, బహువారావర్తిత మహాదానవైభవా వర్తిత కీర్తిభాసుర, నిజనామాంకితాకలంకవస్తుసమగ్ర బహుళా, గ్రహారభూషిత,చోళధారామండల నిఖిలభోగవిభవనిర్జితాఖండ, ల సాధితసముద్రాంతరద్వీప పరనృపాలసంస్తుతప్రతాప, నేపాళ భూపాలస్థాపనాచార్య, కర్ణాటరాజపూజనీయధౌరంధర్య, రామ సేతు శ్రీరంగవిజయరాఘవపుర కుంభకోణాది దివ్యస్థలప్రతిష్ఠాపి త రామభద్రసర్వజనసంభావిత, గాంభీర్యముద్రావినిర్జిత సముద్ర సదాశ్రితభరణ దీక్షాదక్ష దక్షిణసింహాసనాధ్యక్ష, రాజాధిరాజ సన్నుతాసాధారణశౌర్య దిగంతప్రసిద్ధతరౌదార్య సుజ్ఞానజనక సతతసంసేవితజనక పోషితవిద్వత్కవియూథ, భువనశోభితగుణస నాథ, బలవత్పరిపంథిగృహీత సామంతమహీకాంత విమోచనశ్లా ఘనీయబాహాబల, మూర్తిమాంబాగర్భశుక్తిముక్తాఫల, చినచెవ్వ నృపాలపుత్త్ర, సజ్జనస్తోత్రపాత్ర, రూపరేఖావిజితకుసుమసాయక

సకలధర్మసంధాయక, రఘునాథనాయకప్రణీతం బైన వాల్మీకిచరిత్రంబను మహాప్రబంధంబునందు

ద్వితీయాశ్వాసము.



శ్రీరస్తు.

# వాల్మీకి చరిత్రము.

## తృతీయాశ్వాసము.



శ్రీజనక నందనావ
క్షోజ ప్రవిలిప్తమసృణఘుసృణక్షోద
భ్రాజిత బాహాభ్యంతర
రాజ నయకలాకలాప రఘుకులదీపా !

వ. అవధరింపు మప్పర్వతుం డమ్మునుల కిట్లనియె. నవ్విధంబున నాశబరనాధుండు.

క. బాలునిలీల న్మత్తుని
పోలిక నితరంబు బుద్ధిఁ బొడమక యతఁడు
ద్వేలాత్మానందస్థిర
శీలుండై ఘోరతపము సేయుచు నుండెన్.

క. అతని శిరంబున నీవృతి
హతపటురవవహ్నిజాల మద్భుతధూమ
ప్రతతులతో నుత్థితమై
యతన్కితోపప్లవంబు నడరం జేసెన్.

చ. ఉగమున నంబయుంచుఁ జను లుల్లములంగమ దల్లడంబులం
బొగులఁగఁగొన్ని దిక్కులఁ గపోతకపోతసమూహధూమ్రమై
పొగయుచుఁగొన్ని దిక్కులఁ బ్రభూతశిఖావయమంటమింటిపై
నెగయుచు నన్నిలోకములు నేర్చెఁ దదీయతపోగ్ని మిక్కిలిన్.

క. గుజగుజలాడుచు వెడలిరి
గజగజ వడఁకుచును మౌని గంధర్వాల్
నిజవసతులు తద్ధూమ
ధ్వజకీలవ్రజము లన్నివంకలఁబర్వన్. 6

క. ఇక్కరణిఁ దత్తపోరణిఁ
బిక్కటిలిన వహ్ని లోకభీకరమగు మఱి
గ్రక్కున దివి కెక్కిన మదిఁ
బొక్కి పురందరుఁడు బ్రహ్మపుత్త్రునితోడన్. 7

ఉ. చిత్తజవైరి ఫాలశిఖచే జగమెల్లను నేర్చుఁ జూచెనో?
యిత్తెఱఁగంటి పట్టమున కేవిటు లుండక యుండ నెవ్వఁడే
నెత్తులువెట్టెనో మఱియు నేకతమే వివరింపు మయ్య నా!
కిత్తెఱఁ గంతయుం గృపతమేశ్వర! బ్రహ్మనందనా.

చ. అన విని నారదుండు మది నాఁగస యిల్లని నోసురేంద్ర! భూ
మిని దమసానదీతటిసమిద్ధవిశుద్ధగుణప్రసిద్ధుఁడౌ
వనచరుఁ డొక్కరుండు రఘువల్లభుఁగూర్చి తపంబు సేయుచుం
డ నతని వేఁడిమిట్లు భువనంబులఁబొక్కఁగఁజేసె నంతయున్.

వ. అక్కిరాతవరుం డనారతసీతారమణస్మరణప్రభావంబునం జెందిన యనిందితాచారుం డగుచు నరవిందభవాదిపదంబు లతితుచ్ఛంబులుగా నెఱింగి యితరేచ్ఛ దొఱంగి స్వచ్ఛతరస్వచ్ఛంద పరమానందభూయంబును, సకలచ్ఛందోభిధేయంబును, మునిభాగధేయంబును, భక్తజనవిధేయంబును, రామనామధేయంబును, నగు నొక్కరూపధేయంబు నిరంతరధ్యేయంబనితలంపుచునున్న వాఁడతనివలన నీకు భయంబు లేదు పురందరా! అని పిలిచి డెందంబునఁ జేయిడి సుఖంబుననుండు మనిన నొక్కింత ప్రసన్నముఖుం డగుచు శతమఖుం డమ్మునిశేఖరుం గనుంగొని.

సీ. నముచిజంభవిజృంభణము చించి మించిన
కతలు వ్రాసిన భిత్తికలు సెలంగ
సంతానమంజరీసంతానములు గూర్చి
కనుపట్టు పట్టు మేల్కట్టులమర
గంధర్వభామినీగాంధర్వసంగతి
ఘుమ్మను పసిఁడిటంకులు వొసంగ
కడలలోకములు నిల్కడలు గన్గొన, వచ్చు
రమణీయమణిజాలకములు దనర
నిర్మలప్రభ మీఱు సుధర్మయందుఁ
జుట్టు నుచితాసనంబుల సురలు మునులుఁ
గ్రమ్మకొని కొల్వఘనవైభవమ్ము మెఱయ
నిండుకొలువున నుండియాఖండలుండు.

## తృతీయాశ్వాసము.

క. అమరీ జనకర చాలిత
చమరీ వాలా నిలాభి చంచల దలక
భ్రమరీ సంయుతుఁడై వి
భ్రమ రీతిచెలంగ హరి విరాజిలుచుండన్.

క. కనుఁగొని సమ్ముఖమునకుం
జన కటులేతెంచి వచ్చి సవినయ గతులన్
మును లోచన రుచి వీచిక
ల నీలములు వడసి చుట్టులన్ వైచి తగన్.

క. కర కంకణ నిక్వణములు
బెరయఁగఁ దగ మ్రొక్కి లేచి పిఠిఁదికిఁజని ని
ర్జరవల్లభు ముందటఁ జం
దురుకావి చెఱంగుకప్పుతో నటునిల్చెన్.

క. నిలిచినఁ గనుఁగొని సురపతి
పలికెం గమలాస్యలాస్య పరిచితి నీకుం
దులలే రెచ్చట నచ్చర
చెలువలలో నిది జగత్ప్రసిద్ధము సుమ్మీ.

క. అటుఁగన ఘనకార్యమొ
క్కటి గలిగిన దిపుడు నీవు గడగి మనోభూ
పటుశరలక్షణమగు నీ
కటాక్షవీక్షణము చేత గాఁజేయదగున్.

చ. భయమతియాడె వెండియు సభన్నిను భంగ మొనర్తు నీపయిన్
దయగల యట్టి యర్ధపతి నందనుఁడుం దలవంచ నంచులోఁ
బ్రియపడి యుండ్లనున్న దొరబిడ్డల నాడుదు రేసురేంద్ర! యా
పయిమతి యేమివచ్చునో యపాయము నేరఁగరాదు పిమ్మటన్. 2

గీ. కలవి లేనివి దొరసమ్ముఖమునఁ గలద
టంచు బలుకంగ వచ్చునె ? యమరనాథ !
హరిణియనియెడు తామరసాక్షి సాక్షి
నిలిచియున్నది యదియెల్లఁ దెలిసికొనుచు. 2

క. లాలించి స్వామిబిరుదులు
పాలించితి రనుచు నపుడె వదరక యుంటిన్
వాళించి విడుతుగర్వము
చాలించి సనంగదాని సరివారు నగన్. 28

క. అని యిట్లు రంభ యూర్వసి
దనునాడిన పలుకులెల్లఁ దప్పక యుండన్
మునుకొని చెప్పినదంతయు
విని వెడవెడనవ్వి యమరవిభుఁ డవ్వేళన్. 29

క. ఔరా ! యూర్వశి గర్వము
బీరము రంభకును మెచ్చి బిరుదిచ్చుటయే
నేరమె విద్యలు దెలియన్
నేరమె తనయాట నేర్పు నేఁ డేర్పరుతున్. 30

వ. అని పలికి యూర్వశినిచకోరాక్షి గన్నుంగొని నేత్రహస్త
లంబనుపవారుచుం [illegible] నాళం
బగు శ్రమసూచకంబుగ [illegible] నెలుల [illegible] నజ్ఞయై
నటనపాటవంబులుగప్పు [illegible] గరుంగొని నేఁడు
నింద్రోలగంబై యాఖండలుండు నృత్తప్రసంగంబుసేయుచు
నిన్నుబిలువనంపెననిన నన్ను మత్తకాశినియు నా[illegible]ంబు ప్రకా
శించ నేఁడు రంభాగర్వభంగంబును నేఁడు మదీయనాట్య
విజృంభణంబును నేర్పడంగఁదాయనుమతు [illegible] సేసి యుల్లం
బున. 31

సీ. వలరాజు మదదంతి తలమాళిక [illegible]ఁ
గలికిచన్నులఁ బయ్యెంచెలలర
రతిచేతిజీనిసురంటి కూనిదియఁగఁ
గళుకుబంగరుచ్రాంత కాసెమెఱయ
శృంగారఫణిఫణా భంగిఁదా మొతు మట్లఁ
గప్పమిాలెమసామ కొప్పుదనర
వంఘ్రిపద్మముచుట్టు నతివలయంబుగా
నీలాలసరపణల్ నీటుసూపఁ
బసిఁడితీఁగెకునాల్చిన పటికపొలెఁ
జిటులుగందంబు నెమ్మేన జిగిదొలంక
నృత్తవేషంబు మిక్కిలి బిత్తరింప
వచ్చెనూర్వశి సకియ లిర్వంకఁగొలువ. 32

ఉ. వచ్చి జొహారు సేసి నిలువన్ సురనాథుఁడు చూచి రంభతో
మచ్చరమేటికిన్ ? బిరుదుమాటలకుం బనియేమి ? నీకు నీ
పెచ్చులువల్కనేల నినుఁబెంచినతండ్రికిఁ గీర్తిఁ మిక్కిలిం
దెచ్చితి విద్యగల్గుటకుఁ దిట్టుటయే ఫల మింతచాలదే. 33

క. అని యిటునింద్రుఁడు పలికిన
విని యూర్వశి కేలుమొగిచి వినయంబున నో
ఘనవాహన; యెఱుఁగరాదం
జనదైనను విన్నవింతు సర్వజ్ఞనిధీ. 34

క. ఇన్నాళ్ళు నన్ను మిక్కిలి
మన్ననఁ గావించి చాల మంచిన నీవే
కన్నడుగు సేసితేమని
విన్నపమొనరింతు నీకు విబుధాధిపతీ ! 35

క. నాకాధిప; యిటురంభన్
నాకుం బ్రతిసేయుటకు మనంబలరెఁ దగున్
లోకమున రెండుగల్గినఁ
గా కరయఁగ నొకటిమేలు గానందగునే. 36

ఉ. ఏలినవారు మెచ్చి బిరుదిచ్చినవార్తలు విన్నదాననై
తాళితిఁగాక తా బిరుదుఁదాల్చితినంచు వహించెనొక్క నా
వేళ నెయుందఱుంగనఁగ వే బిరుదుల్ తెగఁగోసి దానిచే
వ్రాలఁగనీడిపించికొని వత్తుఁజుమీ యిటకున్ సురోత్తమా. 37

సీ. శివుఁడొక్కఁడు నాఁడు దేశికిమెచ్చి నాకిచ్చెఁ
బెద్దవజ్రపుఁగుచ్చు బిరుదావళిగ
నాతండ్రి హరి యభినయము మేలని యిచ్చె
హారిసీలముల కడియాలజోడు
చతురాననుండు సరస్వతియు గానము మెచ్చి
కెంపుసంగిరంబులయందుఁ బసిఁడికాసె
విత్తాధిపతి తాళవిన్యాసమునకు బ్రే
మంగళాంగి యభయహస్తములిచ్చె
నెన్నియేమియుఁ గలవని యెన్నహావేఁ
బెట్టెఁ బెట్టెఁడు బిరుదులు గట్టుగట్టు
యున్నయవి నాకనేఁటికి నొక్కనాఁడు
బిరుదు లేటికి విద్యయే బిరుదు నాకు.
నాట్యసంగీతకళల నెవ్వండు నన్ను
రంభ నోలుపు మెంతయు నోడఁబడఁద
దేవకులనాథ ! నాసత్త్వదీప్తి వఱుఁ
పోలఁతి మొక్కటికిని నన్నుఁ బోలఁగలదె.

గీ. తారతమ్య మెఱుంగని నాతివల్ల
నందుకొంటెను నడవ్రలఁ గొండెలంగ
నాకునలములు దిని యల్ల వారునిశ్శ
మురహరుని నైనఁ గొల్చుట ముఖ్యవృత్తి.

క. వాసవ! నాట్యంబున నా
వాసియెఱింగియును నన్ను వంచనచేతన్
గాసింబడఁజేసిన నది
నీసర్వజ్ఞతకె కొఱఁత నిలుచుంజుమ్మీ. 41

క. ఇదెదట్టిగట్టుకొని మీ
యెదుట న్నిలిచితిమి నేఁడ యిద్దఱమును గొం
తేఁదడవు మానాట్యంబులు
పదరకవీక్షించి వాసి పరికింపుఁ డొగిన్. 42

వ. అనియివ్విధంబున నూర్వశి సుపర్వసింహాసనాధ్యక్షు సమక్షమంబున నధిక్షేపంబులువలికి, యంతనిలువక యంతంతకుం బ్రబలు నలుక నొకింతయు నళుకక పట్టునలంబునందిట్టుచుం బట్టుకుబుసంబు పక్కున వ్రీలనవేల ధారాళస్వేదకణజాలంబునం దరంగితంబగుచుఁ గురంగమదరంగతిలకంబుఁ గరఁగింప హృదయకుహరంబు వెడలి యాడుకోపభుజంగంబు తెఱంగునఁ గీలుజడ యిట్టట్టుచలింప నిలింపవల్లభుంజూడకయుఁ జూడఁగనద్రిత్న రుచిరించోళికలు వియత్తలంబునం దెరలెత్తఁ దత్తరంబునఁ దలయూఁపుచు సువర్ణకర్ణతాటంకసంకలితారుణమణిప్రభాడంబరంబులు ప్రతిబింబించిన చందంబునం జెందిరంబుఁజిలికినపోలికఁ గపోలఫలకంబులు జేవురింపఁ గెంపుగదురు లోచనంబులం జురచురంజూచుచుఁ గుచ్ఛచూచుకంబులపయిఁ గొట్టువడినహారమౌక్తికదట్టంబులు

చుట్టును మిట్టిపడ దీనిఁ గొట్టించకయుంటినేని హరిపట్టిసే
యని దట్టించి కరంబుననురంబుఁ దట్టితట్టి చెఱంగురంగునీ
లంపుఁ గుచ్చులు విచ్చలవిడిం జెదరి పరవంబదరి పదరింఖన్మ
ణిపుంఖితసింహముఖబిరుదనూపురంబులు బిట్టు మొరయ
రయంబడర నడుగులు దాఁటింపుచు విద్యావిశేషంబు బాటిం
పుచు నెడనెడంజగడంపుజడదారి దనదారింజూపువపి యొ
క్కింతపక్క లెగయంజొక్కినగుచుఁ గుక్కిళ్ళుమ్రింగుచు
మెడనిక్కించి కుంచెసారించునెపంబుననెచ్చరింప మిగుల
మచ్చరింపుచు సంరంభంబున రంభంగదిసి యిట్లనియె. 43

చ. హరిహయుఁడిచ్చినం బిరుసులం గుటపాడియె సీసురంభసా
సరిగనదేశి శుద్ధబహుచారుల నాడఁగలావెయుంచు వే
సరిగమెఱుంగుటంచు వగచంకఁదుకాని మొఱుంగురంగుబం
గరుననుగొంగుపట్టి సురకాంతలచెంతనె పంతమాడుచున్ 44

క. పట్టినరంభయుఁ జేయుట
దట్టివడిం దగులుదట్టి తళుకుబెళుకు లి
ట్టట్టు మెఱుఁగుల తెఱంగునఁ
జుట్టున్ వలగొనఁగఁ దిరిగి సురపతితోడన్. 45

ఉ. దేవరయాజ్ఞకే వెఱచితిన్ సురనాయక ! కొంగువట్టి న
న్నావల నొక్కయింతి నిలయంబునకుం జనఁజాలునయ్య ! లో
చేవడ నిప్పుడూర్వశినిఁ జేయని యుందఱసవ్వఁ జేయ నే
కావరమింకెనింక ననుఁగావుమటంచును బల్కెఁ బల్కఁగన్.
46

చ. అనవిని యూర్వశీరమణి యాననమింత చెమర్ప వాలుఁగం
గొనలను గెంపుడాల్చగుడ గుబ్బమెఱుంగుమిటారి చన్నుల
ల్లఁజలియింప నూర్పులు దళంబుగ వెండిగఁ గమ్మనయ్యనం
గని నునువాడిపువ్వు పరిగోలవిధంబున వల్కెఁబల్కెఁగన్. 47

గీ. వేయుగన్నులుగలిగిన వేల్పుతేఁడు
తరముగనేర కిత్తరి బిరుదులిచ్చె
రంభవాదాడు నిట్టి సంరంభమున నె
ఱుఁగుఁగనియిచ్చె యూర్వశిసుద్దులెల్ల. 48

క. నాజనకుఁడు హరితత్కృప
నీజగదండమున వెలయ నిందులనొకచోఁ
దేజరిలు నొక్కెడొరచేఁ
బూజగొనిన నీదుగర్వమున కెనగలదా. 49

వ. అనిన రంభ రోషవిజృంభణసూచనలోచనకోణాంకురిత
శోణప్రభాప్రమేశిత కర్ణతాటంకరత్నప్రభాడంబరయగుచు
నిట్లనియె. 50

క. హరి మన్ననగలదంచును
గరువంబునఁబలికెదీవు కనుగానక యీ
హరిమన్నన నాకుంగల
దరయఁగ నీమహిమలెల్ల నమరులెఱుఁగరా. 51

క. ఇతఁడింద్రుఁ డతఁడుపేంద్రుం
డితనికి నతనికినివాసి యెఱుఁగఁగరాదే

పితృభక్తి నెద్దియేనియు
నతిశయముగఁబలికె దిది యహంకృతియనరే.

సీ. ఆదితాళము ద్వితీయకమంతరక్రీడ
జయమంగళమ్మును జంపెలీల
చాచపూటంబు చచ్చత్పుటంబును షట్పి
తాపుత్రకంబు విద్యాధరంబు
రతిహంసలీల శ్రీరంగంబురంగంబు
కంకాళఖండకా కాథములును
కోకిలప్రియము విలోకితంబు కుడుక్క
డెంకి త్రిభంగి మట్టిగవిజయము
నందినందన జయసింహానందనములు
మొదలుగాఁగలతాళముల్ మొనసినున్న
గూడి కవచట్టముగఁ గొనియాడి తేని
బిరుదులివియిత్తునీకు నెగిరుదటంచు.

ఉ. పేరణి, తండలాస్యమును, పెక్కణి, కుండలి, నాఁజతుర్విధో
దారములైననాట్యముల యందము నెల్ల నెజేంగియుందు నే
పారుచునుండ ముందు విధులాఱునసై తగుసంగహారముల్
రా రసభావదృష్టులలరన్ నటియించెదె మాటలేటికిన్. 5.

వ. అనిన నూర్వశి గర్వసింధుబంధురతరంగాయిత భ్రూభంగయు
గుచు నిట్లనియె. 55

# తృతీయాశ్వాసము.

క. నలినాక్షుఁ డుపేంద్రుండై
బలినడవఁగ స్వర్గమర్త్యపాతాళంబుల్
గొలువఁడె పాదత్రయి నా
యలఘుమహిమ యెవరికైనఁ గలవఁగలదే.

సీ. సంయుతాసంయుత సంజీవహస్తముల్
పదమూఁడు నొకయిరువదియునాల్గు
త్రింశద్గణంబున నృత్తహస్తంబులు
నైదువక్షంబులు నైదుఘటలు
స్కంధంబులాఱును గంధరల్తొమ్మిది
జానువులేదు పార్శ్వంబులేదు
నుత్తమాంగంబు లేకోనవింశతిదశ
బాహుల్ త్రికుక్షులుఁ బదము లాఱు
స్థాయిదృష్టులెనిమిది సంచారిభావ
దృష్టులిరువది రసదృష్టులెనిమిదియును
బొంకముగఁజూపి వింతకోపులుసెలంగ
నాడఁగలిగినఁ గలహించఁ బాడినీకు. ప|

ఉ. అప్పుడె యేల యిప్పుడును నాఁగకమానగుగొంగు వట్టెదే?
యిప్పురుహూతు ముందఱనె యిందఱుచూడఁగనీవుచూచెదే
జెప్పఁగనేల యేమనినఁ జెల్లదె విద్యలుగల్గువారికిం
దప్పక యాడుచాలునెక తాత్మియ యొక్కటివింతకోపులన్. 58

క. ఆహము నీబిగువులు నో
నాహము పలుకులకు నేమి యదిగాకున్నన్
బాహము చదువుము మిన్నక
కూహనె యిటువంటిబిగువుగొన వేమంటన్. 59

క. అనవినిరంభ విజృంభణ
మొనరం గాంబలికె నలుక నూర్వశిసూనా!
నినువంటి మచ్చెకంటికి
ననువగునే యిట్టులాడి యూరింపకొనన్. 60

వ. అని యిట్లు వెంకియు నోండాపలమీరును సాటికిం బేటికిం
జాట్లిల్లు రోసంబున నెనెవెన నోసంబులనగ మణికంకణ
ఝణఝణారణితంబులు [illegible] గరంబులు
ద్రిప్పుచు హస్తకటాక్షవీక్షణంబులం గప్పుచు నృత్తప్రత్యక్తి
చమత్కారంబులు మీరు [illegible]. 61

క. మానిని యేకాశీతి
స్థానంబుల మెఱసి నిలిచి దశమహిలముల్
పూని నటియించు మెచ్చెద
మానసమున నీరసంబు మానకయున్నన్. 62

క. కరణములు నూటమొనిమిది
వరుసం గొనునీకుమెచ్చి వరమిచ్చెద నా
సరిగొంతవట్టువని స
త్కరణంబులు గలుగనిపుడ తగసభలోనన్. 63

గీ. కడఁగి షట్త్రింశదుత్ప్లుతకరణములును
హావణుగమకించి యెనుబదియాఱుగగన
భూమిచారులు గలుగు నేర్పులును మెఱసి,
శ్రమమమరనిల్పియున్న నాసాటివత్తు. 64

గీ. అబలయాంగికవాచికాహార్యసాత్త్వి
కములనఁగమించు నభినయక్రమములమర
నమరవిభుమీఁది దరువులహారువుల్ల
సరసముగఁగొను విరసంపుసరణులెల్ల. 65

ఉ. ఇచ్చట నేల యిద్దఱము నిప్పుడయేఁగి సభాంతరంబులన్
మెచ్చులుదెత్తమిప్డుకల మేల్పరికటించుచు నింటఁగెల్చి యా
రచ్చనుగెల్వఁగావలయు రట్టిడివా డిటువంటి సుద్దులే
నిచ్చినఁగాని యింకఁజెలిఁఋంచు నెరంభయు దంభయుక్తులన్.

సీ. జలధిభంగముతోడి జనియించినట్టినీ
కే భంగమునకు నింకేలతలఁక
జలనిధిశాయికి జనియించినప్పుడే
భంగంబునీకుఁ జొప్పడకయున్నె
దళమెత్తియాడిన తలవంచెదవునీవు
రంభయిందులకు సంరంభమేల
దళమైనవిద్యయందము చూపకుండినఁ
దలవంపు నీకెపో తలిరుఁబోఁడి

యర్థపతిపట్టెఁ జేపట్టినట్టికతన
నిట్టిగర్వంబు పుట్టెనో యిదిసహజమొ
యర్థవంతునివిద్యయే యతిశయించు
నర్థమూలంబు జగమెల్ల ననఁగవినవె ? 67

సీ. దారుసంజీవని చారుసంగీత వి
ద్యకునుండ నీగాన మలరఁగలదె ?
కనకాంగి క్రమమెచేకొనియుండ నాట్యాల
నీయభినయమింక నిలువఁగలదె?
పుంజికస్థలశబ్దముల పుంజిగనుపించు
టకె పూన నీపల్కు ప్రకటమగునె?
క్రతుశుల్కదేశినిల్కడల కేఁనిపల్క
నీయాటపరిపాటి నెగడఁగలదె ?
వెండియొక్కొకవిద్యకే వేఱువేఱ
రచ్చకెక్కినయచ్చరల్ మచ్చరించి
యుచ్చరించినమాత్ర నీ యొచ్చెమెంచ
వచ్చియుండంగ నీగర్వ మెంతగలదు. 68

క. అచ్చరలు నేఁడు క్రొత్తగ
వచ్చిరొ ? నావిద్యఁ గలుగువగలెల్లను
రిచ్చల నిచ్చలు మెచ్చరొ ?
మచ్చరమింతేల తేలమాటాడుదురే.

క. అనియిట్లు రంభయూర్వశి
యును గలహించంగ నింద్రుఁ డోహో ! నిలురం
భ నిలువు మూర్వశియని వా
లిని వారించుచును డగ్గరికిఁ బిల్చి తగన్. 70

క. చెలులార ! మీదువిద్యా
విలసనములమహిమ నేడు వింతగఁజూడన్
వలెనె కిరీటము వెట్టిన
తలకున్నుల్లు డుగఁబోవఁ దగునే యెందున్. 71

ఉ. మానినులార! మీనటన మార్గములందుఁ బరస్పరాధిక
న్యూనత లెంచ లేఁడు హరియుం దమసాతటినిప్పు డుగ్రతం
బూనితపంబుసల్పెడుఁ దపోధనశేఖరుఁ డొక్కరుండు మీ
మీ నిపుణత్వము ల్దెలియు మేకొని యమ్మునిఁ లోను జేసినన్.7

సీ. లోచూపుమఱలించి లోచనంబులువిచ్చి
సోగమీమొగము లే చూచుచుండ
మంత్రస్మరణమాని మౌనంబుదిగఁద్రోచి
యలరి మీతోడనె పలుకుచుండ
బద్మాసనమువీడి భావస్థిరతఁబాసి
మఱఁగి మీవెంటనె తిరుగుచుండ
నసశసస్థితిడించి యనిలపూరణరోసి
మీరిచ్చుఫలము లే మెసవుచుండ

నలమహాముని ద్రామది యలరుటంప
సోనలనుముంచి తత్తపస్స్ఫురితతాప
మెల్లఁబో మెల్లనే యలయించి మీరు
చన్నుఁగొండలపైనుండఁ బన్నవలయు. 73

క. ఇద్దఱిలోపల నెవ్వతె
దద్దరిలక యతని ధైర్యధనముఁ గొనెఁడు నా
ముద్దియకే యీబిరుదుల
పద్దులు దగు నిదినిజంబు భామినులారా! 74

చ. అని సురనాథుఁ డాచెలులకప్పుడు కల్పకసంభవంబులౌ
ఘనమణిభూషణంబులును గాంచనచంద్రకితాంచలంబులై
కననగు చంద్రకావి నుచుగావులుఁ గొమ్మని యిచ్చి వేగ బొ
మ్మనిన కరాబ్జములొ మ్మోగిచియచ్చరనెచ్చెలు లిచ్చ మెచ్చఁగన్. 75

సీ. చెఱకువిల్లసదని వెఱకుమా యీకొమ్మ
బొమవింటవలిమాన్వై మోతుగాని
కాలంబుగాదని కళవళపడకుమీ
కలికిపాటలఁజూచి నిలుతుగాని
యెదఁగంకునకుగుంది యెదవడకుండుమీ
సఖిమోముచాయనే చనుదుఁగాని
గందపుఁగొండపై బొంకు లేదనకుమీ
చెలియూర్పునెత్తావిఁ బొలుతుగాని

## తృతీయాశ్వాసము.

మదనమాధవ శశధర మలయపవన
యనుచుగతిచూపి శుకపికహంసభృంగ
కేకులకు సతిపల్కులు గీతినడయు
చూపుఁగురులును బలభేది చూపిపనుప. 7

గీ. ఇంతమాత్రంబు మీ రానతిచ్చినపుడె
యెంతయుఁగుండొ? యామాని యేమియైన
నేమి నీకృపగల్గిన స్వామి యెట్టి
కార్యమైనను సాధింపఁగలము సుమ్మ. 77

క. మందమరు దిందుమాధవ
కందర్పాదులను దోడుగా నిడుకొని సం
క్రందన కదలెద మేమిదె
మందాకినిదాఁటి నేఁడె మహిమండలికిన్. 78

క. అనియనిపించుకొని సురాం
గన లమ్మనినెమ్మనంబు గరఁగించుటకున్
గనుసన్నలనె యుపాయము,
లనువుగ నూహింపుమని ప్రయాణోన్ముఖలై. 79

సీ. పుంజకస్థలయలంబు సమనోరమహేమ
దారు సంజీవనిచారునేత్ర
కనకాంగి ధాన్యమాలినివపుస్మతి శుచి
స్మిత సులోచననీల మిత్రకేళి

దేవివిద్యుద్వర్ణ దివ్యతిలోత్తమ
చిత్రసేనఘృతాచి చిత్రరేఖ
జలజాస్యమేనక శశిరేఖగోపాలి
ప్రమ్లోదవిశ్వాచి పంచమాళ
లలితక్రతుశుల్క కర్పూరతిలకహారిణి
మొదలుగాఁగల యచ్చరముదితలెల్ల
నొనరఁ దముగొల్వ రంభయు నూర్వశియును
నందనవనంబునకు నేఁగి యందు నిల్చి. 80

క. మందారకల్పతరు హరి
చందన సంతానపారిజాతంబుల చేఁ
బొందుగ భూలోకంబున
కుం దగిన సువస్తుతతులుఁ గొనుచున్ వేడ్కన్. 81

క. నందనము వెడలి పయనపు
టందము గజవాదిపూఁత లలఁది తొడవులం
గుందనపుటంచువగజిలు
గుం దెలిసాలియలు జారుఁగొప్పలు నొప్పన్. 82

చ. నడచిరి యంత రంభభవనంబున నుండె నుసోమయాజు లె
క్కుడుతమిఁబాయ లేమివడిఁగూడఁగరండిటు వాజపేయు లె
క్కడిపయనంబువచ్చె మనకర్మము లీగతినుండె నేఁటికిన్
జడిసెడు పొండరీకులని సారెకుఁబల్కుచు నెంకకల్కుచున్. 83

# తృతీయాశ్వాసము.

పెంజెమటజార దోవతి
పింజెలుమాటికిని గాళ్ళఁ బెనఁగొనఁ గడుపుల్
గుంజెలువెట్టఁగ వేలుపు
లంజెలఁగూడంగఁజని హాళాహాళిమెఱయన్.

సీ. రత్నకంబళమతి రాత్రులుగొంచురా
సర్వతోముఖులు వేసరఁగనేల ?
తాళవృత్తంబు మాపాలిది చయనులు
జగడంబులాడక చనుఁడుకడకుఁ
గపురంపుఁబెట్టె మీకట్టడయెఱుఁగరా ?
సత్రయాజులకింత చలముగలదె ?
ముత్యాలచౌకట్లు మాటమామోపాట
తెలియదే ? వాజపేయులకు నెపుడు
నాఁడెక్రతువులు రామార్పణముగఁజేయ
కుని కిమేపాటువాటిల్లె మనలకనుచు
సొరిదిఁ జనుదెంచుయజ్వలజూచి నవ్వి
యవ్విబుధకామినులు వారి ననిపి యచట.

క. తగువారివెంటరమ్మని
గగనంబున నడచి రింద్రమఘునసౌధంబున్
మగుడిమగుడిచూచుచు న
మ్మగువలుమఱి వారినంటి మార్గమునంపున్.

ఉ. పట్టుగడారముల్ చికిలి బంగరుబ్రాతల చిక్కుబేగపుం
బెట్టెలుఁ బచ్చతాపలకపీటలు మేలివకాసుకట్టుమేల్
కట్టులు గ్రొత్తనెత్తపలకల్ తెరలుం బిక దారిఁబారువా
బిట్టలగూండ్లుఁ గ్రొమ్మెఱుఁగు బిందెలుఁ గొండలు వెచ్చిరయ్యెడన్

సీ. దంటనీలంపు చిక్కంటలు దంతంపు
దువ్వెన లుంకుమ పువ్వుఁబణపు
సకినలమంచముల్ చౌకంపుఁబొంబట్టు
బటువులురాచిల్క పంజరములు
పరిమళంబులయబ్బ బరిణలు చంద్రకాం
తపుఁగోరలు వీకుందనపుగిండ్లు
నిలువుటద్దములు వీణియలు దండియలును
దాళము ల్వేణువాద్యము లురుమలు
నారజంబులు ముఖవీణలానకములు
మద్దెల లుపాంగములు స్వరమండలములు
మొదలుగాఁగల సాధనంబులు ధరించి
కొంద ఱరిగిరి వెనువెంటఁగూడి యపుడు. 88

సీ. భృంగంబ! చెలిచూపు బెళుకులోనిలువుమీ!
మొక్కలంబుననొంటి మొక్కపోక
చిలుకచిలుకలకొల్కి పలుకులో మెలఁగుమీ!
నీరంబుననుజెలి! బీరుపోక

యంచయంచితయాన ! యడుగులోనడువుమిా!
బింకంపుననుమదం బింకిపోక
కోయిలకలకంఠి ! కుత్తుకై యుండుమిా !
మోడితోఁజని మొగమోడిపోక
ననుచు బలములమున్నగా ననిచి తనకు
వెన్నుబలమయి మాధవ విధుసమిారు
లంటినడవంగఁ గదలెఁ బూవింటిజోదు
దండనుద్దండ పుండ్రకోదండుఁ డగుచు. 89

ఉ. ఇక్కరణింబురందర పురేంద్రముఖుల్ చనికాంచిరెంతయుం
జక్కనిచాయ నుల్లసితసారసహంసరథాంగభృంగ స
మ్యక్కలనాద మేదురనిరంతరతుంగతరంగఘోషముల్
దిక్కులనిండఁ బాండురుచిఁదేరు సురాపగ వేడుకల్దగన్. 90

గీ. కాంచిరంభోర్వశులు మదిఁగౌతుకమున
విష్ణుపదియన నీనది వెలయుఁజూచె
యిందుకుల్యల సాఫల్యమొందు మనదు
నందనంబును దీనికి వందనంబు. 91

వ. అని నమస్కరించి వెండియు నయ్యండజయాన లొండొరు
లంగనుఁగొని. 92

ఉ. కన్నెమిటారి బేడిసలు కన్నులచెన్ను వహింపజక్కవల్
చన్నులచందమొప్ప జలజాతపరాగము హత్తి ప్రత్తిపూ

— ప్రన్నియలీలనొప్పఁ గనుల్గారవిలాసిని వోలె సంధ్యనై
యున్నది యిన్న దీమణితిలోత్తమచూచితె? యెంతయొప్పెడున్. 93

క. అభ్రకరిజలములోపల
నభ్రమువుందాను గ్రీడలాడెడుఁ గంటే?
విభ్రమమున నిచటే మ
త్తిభ్రమరముల్లగండ తలముల నింపెన్. 94

చ. పగడపుఁజాయముక్కులును బాదయుగంబులుఁ బైఁడిరెక్కలున్
జిగినునుపోగవెన్నెలలఁ జిమ్మెడుమేనులు మించ నంచలీ
గగనతరంగిణీవికచకాంచనకంజ వనీగృహంబులన్
సొగసి, రమింపుచున్నయవి చూచితె? చారుచకోరలోచనా. 95

క. అనితన్మహిమముఁ బొగడుచుఁ
జనిచని తమసాతటంబు చాయనె గగనం
బుననుండి దిగిరినిర్జర
వనితలవనితలము నవయవస్యశ్రీగమ్మన్. 96

సీ. జలదకదంబముల్ చంద్రబింబంబులు
శరభముల్ విక్రమసముదయములు
శంఖసంఘములుగాంచనలతావలయముల్
చక్రవాకంబులు జలరుహములు
మెఱుఁగుఁదీగియలుఁ గ్రొమ్మించుమానికములు
నావర్తములు సైకతావళులును
కరికరంబులు బాలకమఠముల్ మౌక్తిక
పాళికల్ నవ్యప్రవాళములును

## తృతీయాశ్వాసము.

గగన జలనిధిలోనుండి కలసిమొక్క
ఫరియతోరిగనో యనఁగఁజూపరకుఁదోఁచెఁ
గాంతతరలీల గీర్వాణకాంతలెల్ల
రీవిమెఱయంగ నవనికి డిగ్గునపుడు.

సీ. వియదంబునిధినుండి వెడలివచ్చునసేక
లావణ్యమయమాయ లక్ష్ములనఁగ
బ్రహ్మాండఖనిఁబుట్టి పఱతెంచుజీవక
ళాకలితమణిశలాక లనఁగ
జలదబృందంబులోపలనుండి దిగువకే
తెంచు కారుమెఱుంగుఁదీఁగె లనఁగ
మిన్నేటినుండి భూమికిఁబ్రవాలు గన్నెఁబ్రా
యఁపుమేలిపసిఁడి రాయంచలనఁగఁ
జూడఁదగియామరుల్లోకసుదతు లవని
కవతరింపునఁ దమసాతఁగాంచలమున
నిలిచి తమతమసారస్యములు సెలంగ
మెలఁగుచుండంగఁ బరిచారకులు గడంగి.

క. అమ్మానితప మొనర్చువ
నమ్మునకుం గట్టెదురఁగనందగుబయలన్
గ్రమ్మకొని పొదలువకుళకు
లమ్ముల ఘుమ్మను సమస్థలంబున నొకచోన్.

చ. సమముగమిట్టపల్లములు చక్కఁగఁజేయుచుఁ జుట్టి నీరువా
టముఁగని నాల్గువంకల గుడారములెత్తిరి చీనిపట్టు ప
గ్గములు బిగించి గూటములుఁగట్టినరాతులగూర్చిముందటం
గొమరగు పైఁడితీవ పనికుట్టుల చప్పరముల్ చెలంగఁగన్. 100

ఉ. అక్కడి చాయరంభయును నాత్మసఖీమణులెల్లఁ గొల్వఁగా
జెక్కసలాడు రాచిలుక చెక్కపుమేలిగుడారునందు సొం
పెక్కవసించె నూర్వశియు నిష్టవయస్యలఁగూడిగండుమీన్
జెక్కియపుంగుడారమునఁనిల్చెఁబభద్రశమముల్ దొఱంగఁగన్. 101

ఉ. అంతట నంశుమంతుఁ డపరాంబుధిఁజేరె శకుంతసంతతుల్
బంతులుగట్టిగూళ్ళకెగఁబాఱఁగ సాగె దిగంతసీమలన్
సంతమసంబుపేరె జలజంబులుదారె రథాంగపంక్తికిన్
గంతులుదీఱె నుత్పలవనంబులనాడఁగఁజేరె భృంగముల్. 102

సీ. గగనాంబునిధిలోనఁ గనుపించుమౌక్తిక
నికరంబులనఁగఁ దారకలునిక్కెఁ
దారకాంగనలెల్లఁ దమినాథుకుందకం
దుకము చందమునఁ జంద్రుండు దోఁచె
చంద్రుఁగన్గొని పాలసంద్రంబుపై కుబ్బి
నిండెనాఁ బండువెన్నెలలుగాసె
వెన్నెలబైట గర్వించి పంచశరుండు
కలువతూపులను లక్ష్యంబులేసె

గలువతూపులమర్మము గాడ బెదరి
పదరిమెత్తనితలిరాకుఁ బాన్పులందు
బల్లవులఁ గౌఁగిలించిరి పల్లవోష్ఠు
లలఁతి తెమ్మెరనెమ్మని యలఁతదీర్ప. 103

చ. నిలిచినతేటవెన్నెలలనీడలు చూచుచుగట్టి వెన్నెలల్
జిలుగుమెఱుంగు ముక్కుతుదఁజించిమెసంగుచుదప్పిగప్పినం
బలుచనితియ్యవెన్నెలలబానముసేయుచుఁ బ్రేమడాయుచున్
మెలకువమించనయ్యెడ రమించఁదొడంగెఁ జకోరదంపతుల్ 10

క. ఇమ్మాడ్కి జనానందక
రమ్ముగ వెన్నెలలుగాయ రంభోర్వశులున్
గుమ్మెతగుడారములకడ
ఘుమ్మను కపురంపుజగతిఁ గూర్చుండి తగన్. 105

గీ. దండియలు మీటి రహిగానదంతిచెలఁగ
నింద్రుమీఁదటిపదము లెన్నెని వింత
వర్ణములఁ బాడి యుత్పలవాసితంబు
లైనగంధోదములు గ్రోలి హాళిదేలి. 106

ఉ. చొక్కుచునచ్చటన్ మదముసొంపునసోలుచునుండియంతటం
జక్కనిపైడితీవపని చప్పరమంచములన్ వసించి రిం
పెక్కఁగ నూడిగంపు జెలు లివ్వల నవ్వలఁ గంకణధ్వనుల్
పిక్కటిలంగఁ దాళగతి లీలలుహత్తి పదంబు లొత్తఁగన్. 1

సీ. ఇటులవ్వధూటులు పటగృహంబులలోనఁ
బవళించిమౌనితపంబుఁ జెఱుప
నెద్దియుపాయంబో? యద్దివ్యసభయందు
మనలకుఁ గీర్తిగల్గునొకో ? యింక
ననిపల్కుచొక్కింత కనుమూసిరో మూయ
రో యంతలనె తూర్పునను వేఁగుఁ
జుక్కగన్పించె నల్దిక్కులు దెలుపెక్క
నరుణోదయంబయ్యె నిరులువిరిసెఁ
గుక్కుటంబులు "గొక్కొరో కో"యటంచు
మ్రోసెఁబక్షులకలకలంబులు చెలంగె
వనజములు మెల్ల ముకుళభావములువదలెఁ
గదలెఁదమజోడుగూడిఁ జక్కవలు వేడ్క. 108

క. ఉదయించె సూర్యుఁడంతట
నుదయాహార్యంబునెల్ల నుస్రసహస్రా
భ్యుదితారుణరుచిమేలిమి
యుదిరి పసిఁడికొండ పగిది నుండంజేయన్. 109

వ. ఆసమయంబున. 110

క. ఉప్పవడంబై వేలుపుఁ
గప్పురగంధులును వేడ్కఁగ్రైసేయుచు నేఁ
డప్పరమమౌనియుండెడు
చొప్పరయుదమనుచు నడుచుచును దమలోనన్. 111

తృతీయాశ్వాసము.

క. గ్రక్కునఁ జనరాదచటికిఁ
జక్కఁగఁ గుసుమాపచయ మిషంబున సొంపుల్
నిక్కంగఁబోయి యతనిం
జొక్కింతము మానులింత సులభులె? తలఁపన్.

క. అని పల్కుచుండినంతకు
మునుపె వసంతుండు పికసమూహము పొగడన్
మనసిజుఁడు నెగడ మలయప
వనసహితుండగుచు నచటి వనముల నిల్చెన్.

సీ. మోదుగుల్చిగిరించె గేదఁగుల్ననలొత్తెఁ
గురువిందములుఁ గలిగొట్లుఁబూచె
మల్లియల్ గొనసాగె మొల్లమొగ్గలువైచె
మాంవులు గ్రోవులు దావి నెసఁగె
బొగడ పుష్పొడిరాల్చెఁ బొన్న తేటలఁబాల్చె
నిమ్మయు గోఁగుఁదేనియలు గురిసె
సంపెఁగ ల్వికసించె జాదు ల్మదాళించె
గోరంట తిలకంబు గుత్తులెత్తె
వావిలియుఁ బ్రేంకణంబును వంజులంబుఁ
గడిమి చెట్టులు నలరె నప్పుడువసంత
సన్నిధి విశేషమున వనస్థలమునందు
భువియు దివియును ఘుమ్మని పొదలుచుండ.

వ. ఇవ్విధంబున వసంతంబు శుకపిక శిలీముఖ ముఖరితాఖిల దిగంతంబగుచు విజృంభించుచుండ. 115

ఉ. చందురు కావిపావడల జాజు పిఱుంగులఁ జిందుద్రొక్కఁగా
గందపుపిసాళి పాళియలుగట్టి కదంబపుఁ బూఁత తావికిం
జెందిన తేఁటిదాఁటులనఁ జెన్నగు కీలుజడల్ నటింపనా
సుందరు లందఱున్ వనము సొచ్చి చలన్మణినూపురంబుగన్. 116

ఉ. కేరుచు నవ్వధూమణులు కేళివనిన్ విహరించి కొందఱం
జేరుచుఁ గన్నెగేదఁగులఁ జీరుచుఁ బూఁబొదరిండ్లు వేఁకన్
దూరుచు రాని నెచ్చెలుల దూఱుచుఁ గస్తురి పుష్పవల్లులలోఁ
గూరుచు సారసౌరభముఁ గూరుచు చల్లసిగాడ్పుఁ గోరుచున్. 117

రగడ.

నిచ్చ నిచ్చగ నలరుదండలు నించ నించ యనంగుఁ జెలులకు
విచ్చ విచ్చన విడివిరుల్ గురువింద విందొనరించె నలులకుఁ
గలికి కలికిలతలను దుమ్మెద గంతు గంతులు మూఁకమాటికిఁ
జిలుక చిలుకల కొల్కి పలుకులఁ జక్కఁ జక్కులఁ బెట్టనేటికిఁ
గంతు కంతుకము లనఁదగునిది గాదె గాదెను మిగులు గుత్తువె
చెలియ చెలియల నీకు నేనన జిర జిరఁగదిలి చెంత వత్తురె
చిలువ చిలుప మరందరసముల జొట్టజొట్టల విద్య మెత్తురె.
కన్నె కన్నెర చేయనేటికి గానఁగా నవమల్లి మొగడలు
నన్న నన్నన నీకుదగునని నవ్వ నవ్వల లేనపొగడలు
మోదు మోదుగ పుష్ప రెచ్చెను ముస్న ముస్నర వైకముచ్చిరి

లేదు లేదుండగ ముదినికిని లేమ లేమయు పాట వచ్చిరి
దాడి దాడిమములకుఁ బెట్టెదు తరుణి తరుణిమ గర్వమెంతన
నీడ నీడలు నిండెఁ బ్రేమను నిక్క నిక్కడ నిల్తమింతన
కంటె కంటె యొనర్చునిది శుభ కాంతి కాంతికి లతికజాతికి
సంటునంటునఁ బుష్పితుల నదినాననానఁగఁ జేసెనాతికిఁ
హాళిహాలి కుచంబులంటిన నాతినాతితనాన దిట్టెను
బాళిబాలిక పుష్పలేదని పల్కఁబల్మరు గోవుకట్టెను
కలికి కలికుచ యీపునెమ్మెడిఁ గ్రమ్మ గ్రమ్మజ వాముపెట్టను
దళవుదళముగ రాత్రిసరిపోద దండదండను నీకుమెట్టను
ఝుప్పుఝుప్పటి కింపునింపెఁను నింగునిందుని భాస్యనిల్తమె
యప్ప యప్పగువంపు మొగ్గల యాసయాసతి నల్లఁదెల్తమె
చామచామనమేని యాచెలి జడనుజడను వడంగ్రవేసెను
రామరామ మరందఘనసుమ రాజిరాజిల నదియకోసెను
మాదిమాది ఫలంబుతెగదిటు మలయమలయజగంధి ముందట
ననలననలస గతులఁగోసి చనంగనంగన యిపుడు వచ్చెను
మనముమనమున నెపుడునీచెలి మాటమాటగనిటులు హెచ్చెరు
చాలుచాలునగంటి మీరల సరససరసము లాడఁగూడదు
మేలుమేలుపడెన్ లతాంతము మీఁదమీఁదటి మొత్తమూడకు
లలన లలనద పుష్పగుచ్ఛల లామలామజ్జిగముగంటిరె
యలికియలికి లతాంగిక్రొవ్విరి నంటనంట పొసంగవింటిరె
వామవామగతిం జెనకియిరు వంకవంకటు చూడువింతలు

యేమయేమనవచ్చు నెచ్చెలి కీరకీరము నియ్యముచ్చట
రాలరాలగ రుల్వొలివిసిగ రాఁగరాఁగత మేమిఁయింతలు
యరసియరసి కతాతటస్థలి యాందయాందఱు వలయుఁజగఁగ
సరసిసరసిజములును గొనుఁడు వసంతసంతత కేళివిహారుఁగ. 118

క. అనివసిలో విహరింపుచుఁ
జనిచని చంద్రముఖు లిష్టసఖు లిరుగడలం
గనిమనికొలువఁగ నట య
మ్మునియునికికి నేఁగి యతనిముందఱ నేట్కెన్. 119

ఉ. తేనియ క్రొన్నన ల్పసిమి తియ్యని తియ్యని పంక్తిజాలఁగా
గానుకగాఁగనుంచి పదకంజములం బ్రణమిల్లి తేచి యో
మౌనివరేణ్య? పుణ్యమహిమన్ మిముఁగన్గొనఁగ న్గలతత్కృపా
నూనకటాక్షవీక్షణము నూనఁగఁజేయుము మమ్ము నిక్కిన్. 120

క. అసపలికి యతఁ డొకింతయుఁ
గనుదెఱవక వలుకకున్నఁ గని యందఱు నె
మ్మనమున నచ్చెరువందుచు
మునుపెన్నఁడు గానమిట్టి ముని జగములలోన్. 121

క. గట్టిగను మూఁగదయ్యము
పట్టెనొదొ కాక చెట్టొ బలురాచట్టొ
యిట్టులు మనమిందఱమును
జుట్టుంబిలువఁగ నొకింత చూడకయున్నే. 122

సీ. హారినీలములతోఁ సరినీటుపచరించు
కప్పుఁదేరెడు నునుఁగొప్పుచొప్పు
మీఁ జేరుపడి మించి కోఁటీరువెట్టిన
మురువుచూపట్టెడు ముక్కు చెక్కు
పాలుగారుచుఁ జంద్రుని మేలుగానఁగనొప్పు
మోహనంబగు నగుమోముగోము
వాటమా రత్నకవాటమా నిదియనఁ
జాల శోభిలెడి వక్షంబుడంబు
తళుకుబంగరుముప్పిలి తరఁటువోలె
నున్నయది మేను చూడంగ మున్నితండు
విటుఁడయిచరించి కొన్నాళ్ల వెరుకఁదపసి
యయ్యెఁగా కిట్టి యందమెందైనఁగలదె. 123

క. కనమే బిరాననల్వా
రినపచ్చనియొడలు జేగురించిన జడలుం
బెనువంకమెడలుగల య
మ్మునిజడలున్ సొంపులెడల ముల్లోకములన్. 124

క, యువతులసంగతులం గల
చవులెఱుఁగఁడు పుట్టుమొదలు సత్యముగాదే
నవలాలచూపుదలలన్
దవులనివాఁడం గలాఁడె ధైర్యముతోడన్. 125

వ. అని యూదటు నన్నివిధంబులం బలుకుచుండ రంభ యిట్ల
నియె. 126

కం. మద్దైలసద్గాన నీతని
నిద్దురమబ్బెల్లఁబోవ నేర్పుమెఱయ నే
నిద్ధముగ దేశిఁ గొంయెద
నొద్దికగానుండుఁ డనుచు నొనరిచి సఖులన్. 127

కం. బంగరుకాసెయు ముత్తెపు
రంగుల చనుకట్టుఁబూని రంభ మిగుల మై
సింగారము వెలయఁగ ముని
పుంగవు నెదుటన్ మెఱుంగుపోలిక నిలిచెన్. 128

కం. నిలిచి యటునడిచి పుష్పాం
జలిచేసి యసంయుతములు సంయుతహస్తం
బులుచూపి పసిఁడి గజ్జెలఁ
జెలఁగెడు చరణములు రవళిసేయుచు వేట్యెన్. 129

సీ. తరుణీమణియొకర్తు తంబురా మొరయించ
వెలఁదియొక్కతె ముఖవీణయూఁద
సరసిజాక్షియొకర్తు స్వరమండలము వాఁచ
బోఁటియొక్కతె దండమీటి పాడ
విమలాంగియొకర్తు వీణియుపలికింపఁ
గలికియొక్కతె యుపాంగంబుపూనఁ
గిసలయాధరయొకర్తు కిన్నరమీటంగ
లోలలోచనయొకర్తు తాళమొత్త

తృతీయాశ్వాసము.

మఱియుఁగొందఱు సుదతులు మద్దెలయును
నాదజముఁ మొదలైన వాద్యములువట్టి
శ్రుతులుఘుమ్మని హావణించె నతివదేశి
నృత్తవైఖరిచూపె మునీంద్రునెదుట.

గీ. ఇటుల మిగులనేర్పు ఘటియిల్లఁజూపిరి
నృత్యగీతవాద్య నిపుణమార్గ
పటిమచెవిటిమ్రోలఁ బాడినసంకునా
ఫలము లేకపోవ బదరిరంభ.

సీ. ఒకకోపుచాలదే శుకవామదేవుల
కైనను దపము వాయంగఁజేయ
నొకచూపుచాలదే సకలదేవతలను
మోహమహాంబుధి మునుఁగఁజేయ
నొకపాటచాలదే యుర్వీలోశైల సం
ఘములు నీరుగఁ గరుఁగంగఁజేయ
నొకమాటచాలదే యుల్లోలకల్లోల
ముగఁ దేనెవంకలు నిగుడఁజేయ
బూనియిటువంటిబిరుదు కోపులును బెళుకుఁ
జూపులును వింతపాటలు సొగసుమాట
లు రహినెన్నిచూపిన మదిగరఁగదయ్యొ
దయ్యొ మేమనిపుట్టించె నయ్యొ వీని.

వ. అని మఱియు ననేక ప్రకారంబులం బలుకుచుం దమనటన
చాతుర్యంబున నతిధైర్యంబునుం దన విలాస భావంబున
నతిజడభావంబును దేజస్తిమిర సంపర్కంబు నుంబోలెనొ
క్కంతి యలంబొంను వడకయున్న డెందంబునం గలంగుచు. 133

గీ. చిన్నబోయి రంభ చెక్కిటం జేయిడి
యున్న జూచియంత నూర్వశియును
నేనొకింత దడవుగానంబుచే మౌని
మనసు గరతు ననుచు ననుచు వేడ్క. 134

చ. సరిగ మెఱుంగుం జాటసుబుసంబునం జెన్గవపిక్కటిల్ల మే
ల్తరమగు కావిపింజియపదంబులం జిందులుద్రొక్క బచ్చక
ప్పురమున మెచ్చుకుంకుమపుం బూంతసుగంధముచోనుముట్టంగ్రొ
వ్విరిసరులన్ సిగ్దొలకు వేణిచలింపంగ వచ్చి యచ్చటన్. 13

క. మునికట్టెదుర నొయారము
దనరంగం గూర్చుండి యొక్కతరుణీమణిగ
న్గొనినీణియం దెమ్మొవి చ
క్కనిపలుకులం దేనెలొలుకంగాం బలుకుటయున్. 136

సీ. తళుకు నీలపు దట్టములువోలె నీడలు
గానంగం దగు గుబ్బకాయలమర
రతనాల పూసల రాజిల్లెడు సిరాజి
పగడంపు మెట్టులజిగి దొలంకం

## తృతీయాశ్వాసము.

ప్రచుర రాగ లతాంకురములు ప్రాకినలీల
మెఱుఁగారు తంత్రులు మీటుచూప
ఘుమఘుమ ధ్వని నించు క్రొవ్విన యపరంజి
కళుకుల యచుసుల యొళుకుదనర
జీవ రత్నంపు మెరుపు చికిలి కెంపు
బిరడలుచు గరుడ పచ్చల కదివెజీవి
ప్రాత పాగొబ్బట్టు గవిసెనరాణ దనరు
వీణె నొకయింతి నిల్చెను వెలఁది యెదుట. 137

వ. ఇట్లు తెచ్చిన విపంచికి నమస్కరించి పాణి యుగంబునఁ
గైకొని. 138

సీ. గవిసెన సడలించి కరపంకజమ్యుతి
గడలు కోఁజీని పావడలు నుడిచి
బళితంపు మెఱుఁగు గుబ్బలమీఁదఁ దీర్చిఘు
మ్మని నఖంబుల శ్రుతులంటిమీటి
జవ్వాదిఁ బదనిచ్చి సారణుల్సారించి
సరసతబిరడలు చక్కనొత్తి
మంద్రమధ్యమ తార మహిమమీఱఁగఁ ద్రి
స్థానంబులును ముట్టి తాళగతుల
నతులకంకణ ఝణఝణత్కృతులు సెలఁగ
మాయురేయన రాగముల్ ఠాయములును
గీతములు ప్రబంధములు రక్తిఁగనుపించు
వీణెమీటెను నాసీలవేణి యపుడు. 139

మ. లలనారత్నము గానమాధురికి శైలంబుల్గరంగెన్ మృగం
బులు మేపుల్విడి చూచుచుండె నచల న్మూర్ధాగ్రకర్ణంబులై
చెలఁగెన్ బక్షిగణంబు మ్రోడులుచిగిర్చెన్ మాని బృందంబుని
శ్చలభావంబున నంతకంతకుఁగడున్ సంధించెఁగాత్మన్యమున్. 140

క. అదిగని యూర్వశినవ్వుచు
నదిరామదితాయివంటి దనియెడు పలుకుం
జెదరె నుపాయనమొక్కటి
వెదకవలయు వీనిమదికి విశ్వముఁ[?]గొనన్. 141

శా. ఔరారాగము బాపురేయొయొ[?]సురాయంబుల్ బ[?]స్థాయిసం
చారి ప్రాపులు లెస్స కంపితము మైచా[?] మేలమ్మ య
య్యారే మీటుకొలంబుపాడఁదగునాహా[?]యుంచున్ సభా
స్తారుల్లేరిటమెచ్చ నీజమఁడు మెచ్చున్ నేర్చునే గానమున్. 14

క. అనిపొక్కిలికి రంభం
గనుఁగొని మనతగవుఁదీర్చెఁగా మునితపమే
ఘనులతపంబులు చెఱుపం
బనిచిన నికఁ జనఁగవలదు పదివేలైనన్. 143

క. అప్పుయుఁజెల్లెలు బలెమన
మెప్పుడు నీకఁగూడియుంద మిద్దఱమును [?]
ఔప్పునని వారు పాళియ
మప్పుడెయెత్తిపడి నరిగి రమరావతికిన్. 144

వ. ఇవ్విధంబున రంభోర్వశులు తమ యఖర్వగర్వాంధకారంబు
మునిలోకబాంధవు తేజఃప్రభావంబున దూరంబగుటయు
నిర్విణ్ణహృదయలై సుపర్వరాజధానికింజనిన యనంతరంబ
యనంతశాంతగుణమణిఘనవిభూతి తపోధనుండగు నాఘనుం
డచ్చటికి నాయచ్చరసుచ్చెకంటులు వచ్చుట పోవుట లెఱుం
గక యభంగధ్యాననిష్ఠాగరిష్ఠుండై చెలంగుచుండ. 145

సీ. సంచారమాచెంత నించుకంతయు లేమిఁ
జెదలుఁ బ్రువ్వులు నేల మెదలఁదొడఁగె
జెదలుఁబ్రువ్వులతినిఁ బొదుగబుట్టలు వెట్టి
బుట్టక్రొవ్వులలోనఁ బుట్టెఁజెట్లు
చెట్లయందేప్రవేశించి నాల్కాలుఁగ్రోయు
పెనుబాములను దీఁగెలును బెనంగె
దీఁగెలంతంతట దిరిగిగూండ్లుగట్టె
గూండ్లలోనఁ బక్షులు నెలంగె
నంతరాంతరములయందు దంతిసింహ
శరభశార్దూలసింహంబు లిరవుకొనియె
పార్థివకళేబరంబు లోపల వెలుంగు
నంతరాత్మయుఁబలె నతఁడందునుండె 146

క. అటసప్తర్షులు హిమవ
త్కటకవినోదములుచూచి క్రమ్మరి తమపా
తటమునకువచ్చి యచ్చట
నటుఁ నిటుఁ గనుఁగొనుచు వారలందఱుఁదమలోన్. 147

ఉ. శుష్కవనంబు మున్ను చటఁ జూడఁగ నేఁడిదె వింతవింతలై
పుష్కరిణీరసోర్మి కణపూరిత శీతలవాతపోతకా
విష్కృతపుష్పనిష్పతదవేల రసాల మరందకందళీ
పుష్కరనిర్ఝరుల్మిగులఁ బొల్పువహించె మనోహరంబులై. 148

సీ. ముందుకోరెండ లేకుండు మొంగసునెంగ
నల్లో నేరెడు లెన్నియల్లుకొనియె
మున్ను సన్నపుటీఁత ముద్దాలి చెంగట
సురపొన్నగుంపము జొంపమయ్యెఁ
దొల్లియంతటదంతె దొంతరలీచెంతఁ
దీయమామిడులెన్ని మూఁగునెరిగ
మునుముమ్మరపుఁదుమ్మె మనుగంపులీవంక
బలువేరుపనసలు బలిసెఁజాల
నాఱుబుతువులఁ బుష్పంబు లలరుచున్న
వెంతవింతలు మనము నేఁడేఁగులమ్యో
హిమగిరికిఁబోయి యాతలో నెన్నిపెట్టె
దేశకాలవిశేషము దెలియు వశమె. 149

సీ. పులుమేపులనుమాని పులులవీపులు పెట్టి
గునిసియాడెడు లేటి కొదమలిచట
దమినీలకంఠకంఠముల హారంబుల
బాగుజూపెడుఁ గోడెనాగులీడ —

సింగంపుఁగూనలఁ జేపట్టియాడుచు
నున్నవియేనుంగు గున్నలిందు
ముంగిసల్ మూషికంబులు నొక్కదిక్కునఁ
జెల్లాడుచున్నవి చెంతఁగూడి
యింతవింతదలంపఁగ శాంతిమంతు
డెవ్వఁడో యొక్కయోగి యీయెడవసించి
తపమునలిపెడుఁ గాఁబోలు నిపుడుగాక
యుండునే నిట్టి మహిమంబు లొనరుటెట్లు. 150

వ. అని పొగడుచు మఱియును. 151

క. ఇక్కడఁగాదేమసలన్
ముక్కపఱిచె నొక్కబోయ మును మునుకొనివా
డెక్కడఁబోయెనొ యిపుడన
గ్రక్కుననాకాశవాణి గంభీరముగన్. 152

క. ఈవల్మీకంబుననదె
శ్రీవల్లభుభక్తసులభు సీతారమణున్
భావింపుచు నున్నాఁడనఁ
గా వారలరాక యెఱిఁగి గ్రక్కున నతఁడున్. 153

శా. ఆవల్మీకముఁజించికొంచు నుదయాహార్యాంతరాళంబు నం
దావిర్భావమునొందు భాస్కరునిచాయన్ శోణశోణప్రభా
వ్యావల్గత్కిరణంబులొయన జటాప్రాంతంబు శోభిల్లఁగా
వేవేగంజనుదెంచి యమ్మునుల సేవించెం బ్రియంబిచ్చఁగన్. 154

క. సేవించి నిలిచి యంజలిఁ
గావించి మునీంద్రులార కరుణాంబుధులా
రా వినుఁ డేమీవలనం
బావనభావంబుఁ జెంది మాన్యుఁడనైతిన్.

వ. అనినవిని యమ్మునీంద్రులందఱు నానందంబున.

క. ఈజటలీ కృష్ణాజిన
మీజపమాలికయు శాంతియెట్లుగలిగెనో
యీజగదొంగకు నోహో
శ్రీజానిస్మరణమహిమ సెప్ప న్వశమే.

సీ. ధరనెన్నిపుణ్యతీర్థములైనఁ గలుగని
రామనామముసరిరావు దలప
నిర్మలస్థితిమించు నిధులెల్లగలుగని
రామనామముసరిరావు దలప
నానావిధములైన దానముల్గలుగ నీ
రామనామముసరిరావు దలప
నతిశయంబుగమహావ్రతములుగలుగ నీ
రామనామముసరిరావు దలప
రామనామంబె సారంబురామభద్ర
రామచంద్ర రఘూద్వహరామయనుచు
ననయము జపింపవలయు దక్కినవియేల
రామనామంబునకు సరిరావుదలప.

వ. ఇదియంతయు రామనామస్మరణంబకాని వేఱొక్కటిగా దెట్టి పాపిష్ఠుండైన నిస్తారగరిష్ఠుండగుచు శ్రీరామస్మరణంబుసేయు సకలభోగంబులు గలుగుట నిస్సంశయంబు వీడు ప్రహ్లాద నారద పరాశర వ్యాస పుండరీకాదులలో నొక్కఁడుగాని సామాన్యుండుగాడని సన్నుతింపుచు సముచితంబుగా వాని వీడుకొని యథేచ్ఛం జనిరి. వాడు నవ్వల్మీకంబునం బుట్టుట కతన వాల్మీకియను నామధేయంబు వహించె నవ్వాల్మీకి మహామునియు నంతకంత కంతరంగంబున నుప్పొంగు భక్తి విశేషంబున నిరంతర జపశీలుండై యుండ నతని చిత్తశుద్ధికి నలరి రామభద్రుం డొక్కనా డతని యగ్రభాగంబున. 159

సీ. కోర్కులపంటగల్గుటకు వ్రాలెడుమేఘ
మనఁగ వినీలకాయంబుమెఱయ
బ్రణతులకాయువుల్ వ్రాయు తూలికనాఁగ
వాలికతూపొక్కకేల నమర
హస్తదైర్ఘ్యముచూపు ననువునఁ గాంచన
ఘనకార్ముకము భుజాగ్రమున వ్రేల
నీలాద్రిమేఖల సిండారుసిరెండ
చెలువునబంగారు వలువదనరఁ
మహితకరములజిగిగండమండలమున
దాండవముజూప నుద్దండపుండరీక
ఘ్నతరుచిహిండనంబులఁ బాలువెట్టు
క్రాలుఁగన్నులఁ గృపయొల్కఁగానుపించె. 160

సీ. పసిడిగింటెంపుమప్పటికప్పు లోహారిహార
కమ్మకస్తూరితిలకమ్ము భళిర
శరచాపములుప్రాను సరవియమ్మమ్మ మా
ణిక్యకోటీరంబు నీటువాపు
నిగనిగమనుచిన్న నగవులాహా మణి
మకరకుండలముల మహిమ మేలు
తళుకుగుంకుమపు గందపుబూతయుయ్యారె
హారవల్లికల యొయ్యారమౌర
మించననెంచఁదగులీలఁ గాంచి మంచి
మించిజిగిమించు నెమ్మేని మెలతగూడి
చల్లఁజూపులఁ గరుణారసంపుఁజల్లు
జల్లుచును నిల్చె శ్రీరామచంద్రుఁడెదుట. 161

గీ. జానకీజానియిట్లు సాక్షాత్కరింప
నత్తపస్వియు నానంద మత్తచిత్త
వృత్తుఁడగుచును నతులుగావించి లేచి,
కరయుగంబు నిటాలభాగమునఁ జేర్చి. 162

సీ. జయదశరథ సుధాజలధిరాకాచంద్ర
జయతాటకాభిధా చటులబాణ
జయగాధినందన సవనరక్షణదక్ష
జయసుబాహూత్సాహ శమనబాహ

జయగౌతమాంగనాశాపవిమోచన
జయకృతానంగజిచ్చాపభంగ
జయభూమికన్యకోపయమ లీలాలోల
జయవాలి నిగ్రహాశ్చర్యశౌర్య
జయపయోనిధిలంఘన జాంఘికబల
జయదశానన ఖండనచండకాండ
జయవిభీషణ పోషణాసక్తచిత్త
జయమయోధ్యాభిషిక్త శ్రీ జనకజాప్త. 163

ఉ. శ్రీరఘురామ భానుకులశేఖర మీపదపద్మసేవ మం
దారనగంబు ముంగిట నిధానము తంగెటిజున్ను కొంగుబం
గారము వేల్పుమానికము కైవసమైనధనంబు చేరువౌ
మేరువు కామధేనువు సమీపసుధాంబుధి మాకునెప్పుడున్.

సీ. కట్టఁగాలువకదా కల్లోలినీభర్త
చెఱకుఁబట్టముగదా శివునిధనువు
కలువరేకులజోక గద సప్తసాలముల్
పలుకుటీగెమోఁగదా తలఁప లంక
కందుకంబుగదయ్యె దుందుభికాయంబు
కాలఁగిటనబొమ్మగద యహల్య
సూటికంబముగదా సురవైరిదేహంబు
పెట్టుఁజెట్టుఁగదా విభీషణుండు

—గద్య.—

ఇది శ్రీరామచంద్రసాంద్ర కరుణాకటాక్షలబ్ధ సిద్ధసారస్వతవిశేష, నిరర్గళ వాగ్వైభవాశేష, సరససాహిత్యకళాభోజ, సత్యసంభూషిత ముఖాంభోజ, సకలసామ్రాజ్యధౌరేయ, నిత్యవితీర్ణిధారారాధేయ, నిరతావారితాన్నసత్రసంతోషితప్రతిదివస పంచాశత్సహస్రభూసుర, బహువారావర్తిత మహాదానవైభవావర్తిత కీర్తిభాసుర, నిజమాంకితాకలంకవస్తుసమగ్ర, బహుళాగ్రహారభూషిత, చోళధారామండలనిఖిలభోగవిభవనిర్జితాఖండల సాధితసముద్రాంతరద్వీప పరనృపాలసంస్తుతప్రతాప, నేపాళభూపాలస్థాపనాచార్య, కర్ణాటరాజపూజనీయధౌరంధర్య, రామసేతు శ్రీరంగవిజయరాఘవపురకుంభకోణాది దివ్యస్థలప్రతిష్ఠాపిత రామభద్రసర్వజనసంభావిత, గాంభీర్యముద్రావినిర్జితసముద్ర సదాశ్రితభరణ దీక్షాదక్ష దక్షిణసింహాసనాధ్యక్ష, రాజాధిరాజసన్నుతా సాధారణశౌర్య దిగంతప్రసిద్ధతరౌదార్య సుజ్ఞానజనక సతతసంసేవితజనక పోషితవిద్వత్కవియూధ, భువనశోభితగుణసనాధ, బలవత్పరిపంథిగృహీత సామంతమహీకాంతవిమోచనశ్లాఘనీయబాహాబల, మూర్తిమాంబాగర్భశుక్తిముక్తాఫల, చినచెవ్వనృపాలపుత్త్ర, సజ్జనస్తోత్రపాత్ర, రూపరేఖావిజిత కుసుమసాయక సకలధర్మసంధాయక, రఘునాథనాయకప్రణీతంబైనవాల్మీకిచరిత్రంబను మహాప్రబంధంబునందు

తృతీయాశ్వాసము.

# ఆంధ్రవిజ్ఞాన సమితి,

## విజయనగరము.

**అధ్యక్షులు, కోశాధిపతులు :**

రావుసాహేబు వేపకొమ్మ జి. సుబ్బయ్యపంతులుగారు,

బి. ఇ. యం. ఐ. ఇ.,

చీఫ్ ఇంజనీయరు శ్రీ విజయనగరం ఎస్టేటు.

**ఉపాధ్యక్షులు :**

అడిదము రామారావు పంతులుగారు,

రిటైర్డు సీనియరు తెలుగు పండిట్, శ్రీ మహారాజావారి కాలేజి.

**కార్యదర్శి :**

గంటి సూర్యనారాయణశాస్త్రి,

**కృత్యసమాలోచనసమితి :**

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ,
తాతా సుబ్బారాయశాస్త్రిగారు,

శ్రీమాన్ పరవస్తు రామానుజస్వామిగారు, యం. ఏ.,
ప్రిన్సిపాల్ శ్రీ మహారాజావారి సంస్కృతకళాశాల.

శ్రీమాన్ టి. నరసింహాచార్యులుగారు, ఎం. ఏ. యల్. టి.,
లెక్చరర్ భాషాశాఖ శ్రీ మహారాజావారి కాలేజి.

డాక్టరు, బుర్రా శేషగిరిరావు పంతులుగారు,
యం. ఏ., పిహెచ్. డి.,

ఆకుండి వేంకట శాస్త్రిగారు,
పండితులు, శ్రీ మహారాజావారి సంస్కృత కళాశాల,
ఆంధ్ర యూనివర్సిటి సెనెటు, ఎకడిమిక్కౌన్సిలు, బోర్డాఫ్ స్టడీసు సభ్యులు.

# సమితి యుద్దేశములు.

ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున నింతవరకెన్నియో యుద్గ్రంథములు వెలువడియున్నవి, వెలువడుచున్నవి. అవి యన్నియు ఆంధ్రవిజ్ఞానాభివృద్ధికి సహకారములగుచున్నను, ఆంధ్రవిజ్ఞానస్రవంతిని ఆంధ్రావనిలో సర్వతోముఖముగ ప్రవహింపజేయదలంచి, మేమీ " ఆంధ్రవిజ్ఞానసమితి " ని నెలకొల్పినారము.

ఇందు ప్రాచీనాధునిక సారస్వత, చారిత్రిక, నైతికాది సంబంధబంధురములగు హృద్య గద్య పద్యగ్రంథములు, సంవత్సరమునకు నాలుగింటికి తక్కువగాకుండగ బ్రచురించ నిశ్చయించితిమి.

శాస్త్ర సంబంధములగు ప్రాచీనగ్రంథములను, రసభరితములగు ప్రాచీన ప్రబంధరాజములను, అధునాతన కవిపుంగవులు, విద్వాంసులు, కళాభిజ్ఞులుమున్నగువారిచే రచియింపబడిన ప్రకృతోపయోగములైన గ్రంథరాజములను మాసమితికి పంపిన, వాటిని సవిమర్శనముగ పరిశీలించి, ముద్రణార్హములగునేని వాటిని ముద్రించుటకు ప్రయత్నించెదము. ఇంతియేగాక, ముద్రితగ్రంథములవలన లభించినలాభములో కొంతపాలు తద్గ్రంథాధికారికి కోరినచో లభించగలదు.

సమితి యాదాయమంతయు, గ్రంథప్రచురణకు, గ్రంథకర్తలకు, ప్రాచీన గ్రంథసంపాదనకు వినియోగింపబడగలదు, గాన ఆంధ్ర భాషాభిమానులు, ఆంధ్ర భాషోద్ధారకులు, ఆంధ్ర విజ్ఞాన సంవర్ధకులగు ఆంధ్రమహాశయులు మాయీ సమితిలో పోషకులుగను, చందాదారులుగను, జేరి, మా యుద్యమమునకు చేయూత నొసంగి, మాకుతోడ్పడి భాషాభివృద్ధిని చేయుదురుగాక యని యాశించుచున్నారము.

# నిబంధనలు.

పోషకులు:—సంవత్సరమునకు 10- రూపాయిలు తక్కువగాకుండగ నిచ్చువారు యీసమితికి పోషకులుగ పరిగణింపబడుదురు. సమితినుండి వెలువడిన గ్రంథములన్నియు వినామూల్యముగ పొందగలరు.

చందాదారులు:— సంవత్సరమునకు 4- రూపాయిలు ముందుగా నిచ్చువారు చందాదారులుగా నుండగలరు. సమితివారే తపాలాఖర్చులను భరించి గ్రంథముల నందింపజేయుదురు.

చందా నిచ్చువారు తప్పక రశీదును పొందవలెను. చందాసొమ్ము అధ్యక్షునిపేరిట పంపవలెను. గ్రంథములు వి. పి. గా పంపబడవు.

చందాదారులుగా జేరని యితరులకు తపాలాఖర్చులుగాక గ్రంథము 1 రూపాయికి లభించగలదు.

ఆంధ్రవిజ్ఞానసమితి ప్రథమ గ్రంథరాజము.

# రాధామాధవసంవాదము

వెలిదిండ్ల వేంకటపతి మహాకవి ప్రణీతము. శృంగార రసభరితము.

(1700 సంవత్సరపు కృతి)

విక్రమ సంవత్సరారంభమున వెలువడినది.

ఆంధ్రవిజ్ఞాన సమితి - ద్వితీయగ్రంథరాజము.

# విస్మృతకళింగాంధ్రకవులు

కృతికర్త: అడిదము రామారావు పంతులుగారు.

ఆంధ్ర సారస్వతాభ్యుదయ కారకులగు మహాకవుల జీవితచారిత్రాదికములను కీ. శే. కం. వీరేశలింగం, గు. శ్రీరామమూర్తి పంతులువారలు తమకు లభ్యమైనంతవరకు స్వీకరించి, ముద్రించిరి. వారలకు లభ్యముకానట్టి యాక్రిందనుదాహరించిన కవిపుంగవుల జీవితవృత్తాంతములను, వారలగ్రంథములను సంపాదించి, ఘవిమర్శనముగ వారివారి చరిత్రములనువ్రాసి యీసమితి ద్వితీయ గ్రంథముగ ప్రచురించు చున్నారము. ఈ గ్రంథము గద్యపద్యాత్మకమై సకల జనానందకరమై వెలయుచున్నది.

## 1700 మొదలు 1900 వరకు.

### కృతికర్త - కృతులు.

1. శ్రీ పూసపాటి తమ్మభూపాలుడు - శ్రీకృష్ణవిజయము.
2. వెనుమళ్ళ సోమమంత్రి - సీమంతినీ కల్యాణము.
3. శ్రీ పూసపాటి వేంకటపతిమహీపాలుడు - ఉషాభ్యుదయము.
4. అడిదము బాలభాస్కరకవి - శుద్ధాంధ్రరామాయణము, లక్షణసారము (సూరకవి జనకుడు)
5. గోకులపాటి కూర్మనాథకవి - వరాహలక్ష్మీనరసింహశతకము, మృత్యుంజయ విలాసము, (యక్షగానము) వీరసంవాదము.

మున్నగు కవుల జీవితచరిత్రాదికము సంగ్రహముగా వెలువడినది

ఆంధ్రవిజ్ఞానసమితి తృతీయగ్రంథము.

# వాల్మీకిచరిత్రము

తంజావూరు-రఘునాథరాయ ప్రణీతము.

ఇందు, మహాఋషులతపఃప్రభావములు, నారదసమాగమము, వివిధ క్షేత్రమహిమాభివర్ణనము, వాల్మీకివృత్తాంతము, ఆటవికవిప్రపుంగవుని ఐహికాముష్మిక జ్ఞానసమాలోచనము, రంభోర్వశుల గర్వభంగము, బోయలచర్యలు, మున్నగు విషయములు స్వభావోక్తిగ వర్ణింపబడినవి. రఘునాథభూపాలుని కవిత్వము చమత్కారపదభూయిష్ఠమై, పండితపామరకర్ణరసాయనమై మృదుమధురశైలితో నొప్పి, యౌచిత్యపోషకమై యెంతయు మనోహరముగ నున్నది.

అధ్యక్షులు,

ఆంధ్రవిజ్ఞానసమితి,

విజయనగరము.